చందమామ సంపుటి: 61 డిసెంబర్ 2008 సంచిక: 12

## ఈ నెల విశేషాలు













## ఈ సంచికలో...





## అమరవాణి

శాస్త్రములందు నిష్ఠా, సహజ జ్ఞానమూ, ధైర్యమూ, మాటలలో నేర్పరితనమూ, సమయానుకూలత్వమూ, ప్రతిభా-ఇవి కార్యదక్షుడికి కామధేనువు లాంటి గుణాలు.

★★★

త్రివిక్రముడు కూడా వామనుడైనాడు, వరాహం అయ్యాడు, నరసింహమయ్యాడు. నీచమయ్యేది, కాకపోయేది, నీచాతి నీచమయ్యేది ముఖ్యం కాదు. ఏ విధంగానైనా ఉన్నత కార్యం సాధించాలి! అదీ ప్రధానం!



# మంచికోసం మార్పు

'మార్పు' అనే మాట ఇటీవలి కాలంలో అద్భుతశక్తిని సంతరించుకున్నట్టున్నది. ఎన్నికల ప్రచారంలో 'మార్పు' అనే మాటను ప్రధానంగా ఉపయోగించిన బరాక్ ఒబామా ఘనవిజయం సాధించి అమెరికా సంయుక్తరాష్ట్రాల నలభైనాలగవ అధ్యక్షపదవిని చేపట్టి చరిత్రను సృష్టించాడు. ప్రపంచంలోనే అత్యధిక శక్తివంతమైన దేశానికి మొట్టమొదటి ఆఫ్రో-అమెరికన్ అధ్యక్షుడయ్యాడు!

మార్పు అన్నది బహుముఖమైనది. దృక్పథంలో మార్పు; విభిన్న జాతుల మధ్య, దేశాల మధ్య శాంతి సామరస్యాలు సాధించడంలో మార్పు; పేద-ధనిక వర్గాల మధ్య పెరిగిపోతున్న అంతరాల అగాధాలను తగ్గించే ఆర్థిక వాతావరణంలో మార్పు; హింసాద్వేషాలను అంతమొందించి మానవతను పరిమళింపచేసే మంచి మార్పు-ఇలా జాబితా అనంతంగా సాగుతుంది. 'మంచి కోసం మార్పు'ను తీసుకువచ్చే సంవత్సరంగా నూతన సంవత్సరాన్ని జరుపుకోవడానికి తగిన శుభతరుణం ఇది!

ప్రపంచవ్యాప్తంగా వస్తున్న మార్పుల్లాగే మన పత్రికలోనూ మార్పు చోటు చేసుకుంటున్నది. మార్పు అనివార్యం కదా! గత నాలుగు దశాబ్దాలకు పైగా చందమామతో విడదీయరాని అనుబంధం కలిగి ఉన్న నేను, బాధాతప్త హృదయంతో ఈ డిసెంబర్ సంచికతో సంబంధాలు వదులుకుంటున్నానని ప్రియతమ పాఠకులకు తెలియజేయడానికి విచారిస్తున్నాను.

ఈ సందర్భంగా ఇన్నాళ్ళు నా మీద అపార ఆదరాభిమానాలు కనబరుస్తూ, మద్దతు, సహకారాలందించిన పదమూడు భాషల చందమామ అశేష పాఠకులకూ, అభిమానులకూ, శ్రేయోభిలాషులకూ హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

నా మీద ఎంతో విశ్వాసంతో-ఈ 'ఉదాత్త జాతీయ సంస్థ' ద్వారా యువమిత్రులకు సేవలందించే మహదవకాశాన్ని అప్పగించిన చందమామ వ్యవస్థాపకులు మా నాన్నగారు శ్రీ బి. నాగిరెడ్డిగారికీ, చక్కన్న శ్రీ చక్రపాణిగారికీ నేను ఎల్లప్పుడూ కృతజ్ఞుడిగా ఉంటాను.

సంపాదకుడు : **విశ్వం**

Visit us at : http://www.chandamama.com/hindi





**Founded by**
**B. Nagi Reddi and Chakrapani**

*Editor, Publisher :* B. Viswanatha Reddi (Viswam)
*Chief Executive Officer :* L. Subramanyan
*Editorial Advisors :* Ruskin Bond, Manoj Das
*Consultant Editor :* K. Ramakrishnan
*Associate Editor :* A.R. Balasubrahmanyam
*Senior Artists:* K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
*Artist :* Jayapandian
*Assistant Editor :* R. Sudha
*Creative Writer :* R. Vaasugi
*Layout Designer :* B.A. Hemalata Malini

*CIRCULATION TEAM :*
*Chennai :* **T N Ravi Shankar, *National Sales Manager***
Mobile +91 99620 70014
email : ravishankar.tn@chandamama.com
**Fazal Khan, *Manager-Circulation & Institutional Sales - South***
Mobile +91 99625 67860
email : fazal.khan@chandamama.com
*Mumbai :* **Rajendra K Jadhav, *Asst. Manager - Circulation***
Mobile +91 9320565048
**CHANDAMAMA INDIA LTD.,** B-3, Lunic Industry
Opp. State Bank of India, Near Police Station Cross Road
No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : rajendra.jadhav@chandamama.com
*New Delhi :* **Sushil Sharma, *Circulation Manager-North***
Mobile +91 98719 30767
**CHANDAMAMA INDIA LTD.,** Goyal Business Centre,
C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
*Bangalore :* **P. Murali, *Asst. Circulation Manager - Karnataka***
Mobile +91 94488 36952
**CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street
Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage
Bangalore-560094, Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
*Kolkata :* **Ananth Prakash, *Circulation Manager-East***
Mobile +91 98362 82202
email : ananth.prakash@chandamama.com
*Ahmedabad :* **Kalpesh Raval, *Sales Officer-Circulation***
Mobile +91 98245 19946
email : kalpesh.raval@chandamama.com
*Content Head - Online :* **Sowmya Bharadwaj**
email : sowmya.b@chandamama.com
*Head - Business Development :* **Surajit Agarwal**
email : surajit@chandamama.com
*Advertisement :* email : sales@chandamama.com
*Subscription Queries:* L Govindasamy
e-mail : govindaswamy.l@chandamama.com
*Customer Cell :* A B Sairam Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
*Production Executive :* Panchakshari R Math
*Head Office :* **CHANDAMAMA INDIA LTD.,**
JVL Plaza, Block-A, 6th Floor, 626, Anna Salai,
Teynampet CHENNAI-600018
Phone +91 44 24334455, Fax +91 44 2432 2103
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

**ANNUAL SUBSCRIPTION :**
Foreign : US$30 (including shipping and handling charges)

# పాఠకుల లేఖలు



'చందమామ' పిల్లల కోసం ప్రారంభించబడినప్పటికీ అది నుంచీ పిల్లలనూ, పెద్దలనూ కూడా ఆకట్టుకుని గత కొన్ని సంవత్సరాల వరకు అన్ని వర్గాలనూ అలరించింది. చందమామ మార్కెట్లోకి ఎప్పుడు వస్తుందా అని అందరూ ఎదురుచూపులు చూసేవారు. అదొక కాలఘట్టం. కాని ఇప్పుడు పత్రిక కోసం పిల్లలకన్నా పెద్దలే ఎక్కువగా ఎదురుచూస్తున్నారు. దీనికి ముఖ్య కారణం పిల్లలకు ఎల్‌కేజీ నుంచే పెరిగిన చదువుల భారం. పిల్లల చదువుల పట్ల పెద్దల ఆరాటం. అందువల్ల పిల్లలు చందమామను చదవడం గణనీయంగా తగ్గిందనే చెప్పాలి. ఇప్పట్లో ఈ పరిస్థితిలో మార్పు వచ్చే అవకాశం లేదు. కాబట్టి చందమామలో మార్పులు ప్రవేశపెట్టేప్పుడు ఈ అంశం గుర్తించడం అవసరం. చందమామను కథల పత్రికగా మాత్రమే చూడాలనుకునేవారే ఎక్కువ మంది ఉంటారు.

–డి.ఎస్. శంకర్, వక్కలంక – **533 241,**
వయా, మూక్కామల (ఆం.ప్ర)

చందమామ కథలను అనిమేటెడ్ ఫీచర్ ఫిల్మ్‌గా తీస్తారని చదివి చాలా సంతోషించాను. ఇది పాఠకులందరికీ మహదానందం కలిగించే తీపి కబురు. దీనిని ఒక విప్లవాత్మకమైన ముందడుగుగానే భావిస్తున్నాను.

–బొడ్డపాటి రాజేశ్వరమూర్తి, మచిలీపట్నం –
**521 002,** కృష్ణాజిల్లా (ఆం.ప్ర)



# మూగదేవుడు

వేములవాడలో శివయ్య అనే గాయకుడు ఉండేవాడు. వాడు గ్రామాలు పట్టి తిరుగుతూ, నలుగురూ కూడిన చోట యుద్ధ వీరుల సాహస కృత్యాలు, త్యాగాలు వర్ణించే పాటలు రాగయుక్తంగా అభినయిస్తూ పాడి, యాచనతో పొట్ట పోసుకునేవాడు.

గ్రామాలలో ముఖ్యంగా శివ, విష్ణు భక్తు ఇళ్ళల్లో పెళ్ళిగాని, ఏదైనా శుభకార్యంగాని జరుగుతూంటే ముందే తెలుసుకుని అక్కడికి వెళ్ళి వాళ్ళ గోత్రనామాలు, బిరుదులు, వంశగొప్పదనం చదివేవాడు. ఆ తరవాత, ''అయ్యా, అమ్మా, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు వివాహాలు చేసుకున్నప్పుడు పిచ్చుకకుంటు జాతివాణ్ణి సృష్టించారు. ఆ పిచ్చుకకుంటు త్రిమూర్తుల గోత్రనామాలు చెప్పి కల్యాణము జరిపించాడు. నేను కూడా ఆ పిచ్చుకకుంటు జాతివాణ్ణే. నూతన వధూవరులు పిల్లాపాపలతో సిరిసంపదలతో కలకాలం చల్లగా వర్ధిల్లుతారు,'' అని చెప్పి ఆశీర్వదించేవాడు.

శుభకార్యము జరుగుతున్న సమయంలో పిచ్చుకకుంటు రావడం ఎంతో శుభప్రదంగా భావించి గృహస్థులు శివయ్యకు సంతోషంగా భోజనం పెట్టి, తాంబూల దక్షిణ ఇచ్చి సత్కరించేవారు.

ఒకసారి శివయ్య భైరవపాలెం అనే గ్రామంలో పాటలు పాడి బిచ్చమెత్తుకుని మధ్యాహ్నానికి ఊరికి సమీపంలో ఉన్న భైరవుడి గుడికి చేరుకున్నాడు. వేపచెట్టు కిందకూర్చుని యాచించి తెచ్చుకున్న అన్నం గిన్నెలోంచి తినబోతూండగా అక్కడికి ఒక కుక్క వచ్చింది. శివయ్య ఒక ముద్ద తీసి కుక్కకు పెట్టాడు. అయితే, కుక్క దాన్ని ముట్టుకోకుండా ముందు కాళ్ళు పైకెత్తి

జొన్నలగడ్డ మార్కండేయులు



శివయ్య చిన్నగా నవ్వుతూ, ''ఇదేం పెద్ద విషయం కాదు. కడుపునొప్పికే కాదు. ఇతర రోగాలకు కూడా మా దగ్గరఎన్నో చిట్కావైద్యాలు ఉన్నాయి,'' అంటూ అక్కడి నుంచి గుడి వద్దకు వెళ్ళిపోయాడు.

శివయ్య వైద్యం గురించి రాగయ్య దంపతులు ఊళ్ళో అందరికీ చెప్పడంతో ఆ సంగతి ఆనోటా ఈనోటా పడి భైరవపాలెంలో ప్రముఖ వైద్యుడుగా పేరు మోసిన బసవాచారికి చేరింది. అతడు ఆ మాటవిని మొదట ఆశ్చర్యపోయాడు. ఆ తరవాత, ''రాగయ్య దగ్గర దమ్మిడీ ఆశించకుండా వైద్యం చేశాడంటే శివయ్య చాలా మంచివాడు కదా! మన బసవాచారి డబ్బున్న వాళ్ళకే కదా వైద్యం చేస్తాడు,'' అని జనం చెప్పుకుంటున్నది విని అసూయతో నిండిన ఆగ్రహానికి లోనయ్యాడు. తిన్నగా గ్రామాధికారి వద్దకు వెళ్ళి, ''అపర ధన్వంతరిగా పేరు పొందిన శేషాచారి ప్రధాన శిష్యుణ్ణయిన నా వైద్యాన్ని 'ఇచ్చింది మందు, తగ్గించిన వాడు వైద్యుడు' అన్నట్టుగా ఒక బిచ్చగాడి చిట్కా వైద్యంతో పోల్చి గ్రామస్థులు నన్ను అవమాన పరుస్తున్నారు. దీనికి మీరే ఏదైనా పరిష్కారం చూడాలి,'' అని చెప్పి వాపోయాడు.

గ్రామాధికారి వెంటనే శివయ్యను పిలిపించి అర్హతలేకుండా వైద్యం చేసినందుకు మందలించాడు. అ తరవాత అతడి వైద్యాన్ని బసవాచారి వైద్యంతో పోల్చి కించపరచినందుకు రాగయ్య దంపతులను బసవయ్యకు క్షమాపణలు చెప్పమన్నాడు.

దణ్ణం పెట్టింది. ఆ తరవాత తనతో రమ్మన్నట్టు నేలను దువ్వుతూ ముందుకూ వెనక్కూ నడవసాగింది. శివయ్య అన్నం గిన్నెను జోలెలో వేసుకుని కుక్క వెంట బయలుదేరాడు. అది అతణ్ణి ఒక గుడిసె ముందుకు తీసుకు వెళ్ళింది. శివయ్య గుడిసెలోపలికి తొంగి చూశాడు.

లోపల ఒక మధ్య వయస్కుడు కడుపు నొప్పితో బాధపడుతూ మెలికలు తిరిగి పోతున్నాడు. రాగయ్య అతడి పేరు. పక్కనే కూర్చున్న అతడి భార్య విషయం చెప్పింది. వెంటనే శివయ్య సంచిలోంచి ఒక వేరును తీసి ఇచ్చి రాగయ్యను నమిలి మింగమన్నాడు. అతడలా చేసేప్పటికి కడుపునొప్పి చేత్తో తీసేసినట్టు మాయమయింది. భార్యాభర్తలిద్దరూ శివయ్యకు చేతులెత్తి మొక్కారు.

రాగయ్య దంపతులు అతడికి వెంటనే క్షమాపణలు చెప్పారు. అయితే, శివయ్య మాత్రం, ''ఇందులో నా తప్పేముంది దొరా. మాకు పాటలు పాడటంతో పాటు ఎన్నో చిట్కా వైద్యాలు తెలుసు. మందులు కొనలేని వారికి మేము ఘనవైద్యులమే కదా. ఆ సంగతి నోరులేని కుక్కకు కూడా తెలియడం వల్లే సమయానికి నన్నక్కడికి తీసుకు వెళ్ళింది,'' అన్నాడు అమాయకంగా.

ఆ మాటకు గ్రామాధికారి మండిపడి, ''ఇల్లూ వాకిలీ లేని దేశద్రిమ్మరివి. పాపం అని ఇంత అన్నం పెడుతున్నాం. ఇప్పుడేమో కండకావరంతో కుక్కకున్న తెలివి కూడా మాకు లేదని మా ఎదుటే కారు కూతలు కూస్తున్నావా? ఈ ఊళ్ళో ఒక్కరూ ఇంత అన్నం ముద్ద పెట్టరు. ఆ కుక్క నీకు కూడు పెడుతుందేమో చూస్తాను,'' అన్నాడు.

ఊరి పెద్దలు కూడా గ్రామాధికారి మాటకు వంతపాడుతూ, ''బిచ్చగాడికి ఇంత పొగరు తగదు. ఆ కుక్కే వీణ్ణి కాపాడాలి,'' అంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయారు.

శివయ్య బెదిరిపోయాడు. ఇంటింటికీ క్షమాపణ చెప్పి, అన్నం పెట్టమని అడిగాడు. ఒక్కరూ ఇంత పెట్టలేదు. పొద్దుగూకుతూండగా ఆకలి కడుపుతో భైరవుడి గుడి వద్దకు చేరి అలసటతో అలాగే పడుకుని నిద్రపోయాడు.

తెల్లవారినా వాడికి మెలకువ రాలేదు. ఉన్నట్టుండి ఒక కుక్క వాడి బట్టను పట్టుకుని గుంజడంతో లేచి అయోమయంగా చుట్టుపక్కల కలయ జూశాడు. కుక్క వెంట వచ్చిన ఆ ఊరికి చెందిన రత్నశెట్టి, పిండి వంటలుగల విస్తరిని కుక్క ముందుంచి ''కాలభైరవా! ఆరగించు!'' అని దణ్ణం పెడుతు



న్నాడు. అయితే, కుక్క దానిని ముట్టుకో కుండా శివయ్య బట్ట పట్టి గుంజుతున్నది.

జరిగిందేమిటంటే–కాశీ యాత్రకు వెళ్ళి తిరిగి వచ్చిన రత్నశెట్టి ఆ రోజు ఉదయం కాలభైరవ విగ్రహానికి అర్చన చేయించాడు. పూజారి కాలభైరవాష్టకం చదివి, రత్నశెట్టి చేత ఒక కుక్కకు పూజ చేయించాడు. ఆకు నిండా పిండి వంటలు వడ్డించి కుక్కకు నైవేద్యంగా పెట్టమన్నాడు. ఆ కుక్క కడుపు నొప్పికి శివయ్య చేత వైద్యం చేయించుకున్న రాగయ్యది. అది ఆకువైపైనా చూడకుండా శివయ్య దగ్గరికి పరుగు తీసింది. దాన్ని వెంబడించి వెళ్ళిన వర్తకుడు, పూజారి, ఇతర గ్రామస్థులు అక్కడి దృశ్యం చూసి ఆశ్చర్య పోయారు.

వర్తకుడు, ''ఈ కుక్క నిజంగానే కాల భైరవుడి అంశగలదే. అహంకారంతో మనం వెలివేసిన శివయ్య ఆకలితో అలమటించడం చూసి సహించలేక వాణ్ణి తినమని పిలు స్తోంది,'' అంటూ, మరొక విస్తట్లో అన్నం వడ్డించి తినమని శివయ్య ముందుంచాడు.

అంతలో సంగతి తెలిసి గ్రామాధికారితో కలిసి అక్కడికి వచ్చిన బసవాచారి ఆ దృశ్యం చూసి దిగ్భ్రాంతి చెందాడు. సిగ్గుతో తల దించుకున్నాడు. ఆ తరవాత కొంతసేపు మౌనంగా ఆలోచించి గ్రామాధికారితో, ''తెలివి, ప్రతిభ ఆశ్రయాన్ని బట్టి రాణిస్తాయి. శివయ్య వంటి దేశద్రిమ్మరిగాయకులు వీరుల చరిత్రను భద్రపరిచే వారిగా గౌరవించ తగ్గవారు. అదే విధంగా వాళ్ళ అనుభవ వైద్యాన్ని కూడా నాలాంటి వైద్యులు పరిశీ లించి వెలుగులోకి తీసుకురావాలి. అందుకు మీవంటి పెద్దల ఆదరణ చాలా అవసరం. అహంకారం కొద్దీ శివయ్యను నిందించినం దుకు సిగ్గుపడుతున్నాను. మూగదేవుడుగా నా కళ్ళు తెరిపించిన ఈ కాలభైరవానికి నమస్కరిస్తున్నాను,'' అంటూ కుక్కకు చేతులు జోడించాడు.

గ్రామాధికారి తల పంకించాడు. శివయ్య చేతులెత్తి గ్రామాధికారితో సహా అక్కడ చేరిన వారందరికీ మొక్కాడు. అందరూ ఎంతగానో సంతోషించారు.



మన వారసత్వ స్థలాలు

# మన కొండరైలు మార్గాలు



మనదేశంలో ముఖ్యంగా మూడు కొండ రైలు మార్గాలు ఉన్నాయి. వాటిలో 1881లో ప్రారంభించబడ్డ డార్జిలింగ్ హిమాలయన్ రైల్వే మొట్టమొదటిది. అందమైన ఈ రైలు మార్గానికి 'టాయ్ ట్రైన్' అని పేరుపెట్టారు. ఈ నేరోగేజ్ (610 ఎం.ఎం.) రైలు మార్గం పశ్చిమ బెంగాల్‌లోని సిలిగురి నుంచి డార్జిలింగ్ వరకు వెళుతుంది. 100మీ. ఎత్తులోని సిలిగురి నుంచి 2,200 మీ. ఎత్తయిన డార్జిలింగ్ వరకు 86 కి.మీ. దూరం వెళుతుంది. స్టీమ్ ఇంజన్ ఉపయోగించబడుతోంది. 1999లో ఈ మార్గాన్ని ప్రపంచ వారసత్వ ప్రదేశాలలోకి తీసుకున్నారు.

తమిళనాడులోని 46 కి.మీ. పొడవుగల మీటర్‌గేజ్ సింగిల్ ట్రాక్ నీలగిరి మౌంటన్ రైల్వే 1908లో పూర్తి చేయబడింది. 326 మీ. ఎత్తు నుంచి 2,203 మీ. ఎత్తు వరకు వెళుతూన్న ఈ కొండమార్గంలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం వినియోగించబడింది. ఈ రైలు మార్గం మేట్టుపాళయం నుంచి ఉదకమండలం (ఊటీ) వరకు వెళుతుంది. దక్షిణాదిలోని నీలగిరి కొండల మీద నడిచే మన దేశంలోని ఏకైక 'ర్యాక్ రైల్వే' అయిన ఇది 2005లో వరల్డ్ హెరిటేజ్ సైట్‌గా గుర్తించబడింది.

ఈ సంవత్సరం జూలై 7వ తేదీ కల్కా-సిమ్లా మౌంటన్ రైల్వేను యునెస్కో వరల్డ్ హెరిటేజ్ సైట్స్‌లోకి తీసుకున్నది. 19వ శతాబ్ది మధ్యలో నిర్మించబడ్డ 96 కి.మీ. సింగిల ట్రాక్ మార్గం ఇది. 1903లో నిర్మించబడ్డ 96.6 కి.మీ. పొడవైన రైలు మార్గం హిమాచల్ ప్రదేశ్ కల్కా నుంచి సిమ్లా వరకు వెళుతుంది. మన దేశంలోని కొండ రైలు మార్గాల విధానాన్ని సాంకేతిక పరిజ్ఞాన అభివృద్ధికి, విలువల పరిస్పరమార్పిడికి ప్రస్ఫుటమైన ఉదాహరణగా చెప్పవచ్చు. ఈ మూడు మార్గాలూ ఇవాళ సక్రమంగా నడుస్తున్నాయి.

19వ శతాబ్దంలో జరిగిన రైలు మార్గాల అభివృద్ధి ప్రపంచ వ్యాప్తంగా వివిధ ప్రాంతాలలో ప్రగాఢమైన ఆర్థిక, సామాజిక అభివృద్ధికీ, మార్పులకూ ఎంతగానో దోహద పడింది.

చందమామ క్విజ్ -9 (అక్టోబర్ '08)
అన్నీ సరైన సమాధానాలు రాసిన ఎంట్రీలు పాఠకుల నుంచి ఒక్కటీ రాలేదు.
అందువల్ల బహుమతి ఇవ్వలేకపోతున్నాం.



# శాంతా క్లజ్ ఉన్నాడా?



శాంతాక్లజ్ పాశ్చాత్య సంప్రదాయం. అది మన దేశానికి సంబంధించినది కాదు. అయితే, శాంతాక్లజ్ అంటే మనమందరం కూడా ఇష్టపడతాం. అవును కదా! తెల్లటి పొడవైన గుబురుగడ్డంతో పెద్ద పొట్ట నిండుగా రకరకాల కానుకలతో హో... హో... హో... అంటూ నవ్వుతూ వచ్చే శాంతాక్లజ్ లేకుండా క్రిస్మస్‌ను ఊహించలేము. కొందరు పిల్లలయితే అతణ్ణి ఆప్యాయంగా క్రిస్మస్ తాతయ్య అని పిలుస్తారు కూడా!

1897లో 'న్యూయార్క్ సన్' పత్రికకు ఒక ఉత్తరం వచ్చింది:

*''డియర్ ఎడిటర్, నా వయసు ఎనిమిదేళ్ళు. నా స్నేహితులు కొందరేమో శాంతాక్లజ్ లేడని చెబుతున్నారు. నాన్నను అడిగితే, 'న్యూయార్క్ సన్' చూడు తెలుస్తుంది,'' అన్నాడు. మరి మీరేమంటారు. దయచేసి నాకు చెప్పండి. అసలు శాంతాక్లజ్ ఉన్నాడా? లేడా?*

-వర్జీనియా ఓ హ్యాన్లాన్''

సంపాదక వర్గ సభ్యుడు ఫ్రాన్సిస్ చర్చ్ ఆ ఉత్తరం చదివి చెప్పలేనంతగా చలించిపోయాడు. అమెరికన్ సివిల్ వార్ సమయంలో వార్ కరెస్పాండెంట్‌గా పనిచేయడం వల్ల భయంకరమైన బాధలను, చావులను ప్రత్యక్షంగా చూసినవాడతడు. శాంతాక్లజ్ ప్రాముఖ్యతను ఎరిగినవాడు గనక ఆ చిన్నారి ప్రశ్నకు చక్కటి సమాధానం ఇవ్వాలని నిర్ణయించాడు.

''*అవును, వర్జీనియా! శాంతాక్లజ్ ఉన్నాడు!*'' అంటూ సంపాదకీయం పేజీలో పెద్ద అక్షరాలతో సమాధానం ఇచ్చాడు. దాన్ని చదివిన వారందరి మనసుల్లోనూ సంతోషపు గజ్జెలు మోగాయి. ఒక్క వర్జీనియా మాత్రమే కాదు. శాంతాక్లజ్ నిజంగా ఉండాలనే పలువురూ ఆశిస్తారు.



మనిషిలో నమ్మకాన్నీ, విశ్వాసాన్నీ, ఆశలనూ నింపే శాంతాక్లజ్ సంప్రదాయం చాలా గొప్పది. నూతనోత్సాహం పొందడానికి మనమందరం కూడా శాంతాక్లజ్‌కు స్వాగతం పలుకుదాం!

చందమామ కూడా శాంతాక్లజ్‌ను విశ్వసిస్తూ, ప్రియతమ పాఠకులకు క్రిస్మస్, నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేస్తున్నది.




# పాతాళదుర్గం

## 5

*[రాకుమారి కాంతిసేనను ఎత్తుకుపోయిన కుంభీరుడనే రాక్షసుడు, కొండప్రాంతం చేరి, గుహలో ప్రవేశించబోతూండగా కాలశంబరుడనే మాంత్రికుడి వల్ల గాయపడ్డాడు. చెట్టు మీదినుంచి ధూమకసోమకులు ఇదంతా గమనించారు. హఠాత్తుగా ఎక్కణ్ణుంచో ఒక బాణం వచ్చి, కాలశంబరుడికి తగిలింది. ఆ వెంటనే అతడూ, రాక్షసుడూ దాపులనున్న గుహల్లోకి పరిగెత్తారు. –తరవాత]*

కదంబ సైనికులు కొందరు, ''అడుగో, రాక్షసుడు! అడుగో, రాక్షసుడు!'' అని కేకలు పెడుతూ గుహల కేసి పరిగెత్తుకు రావటం, చెట్టు మీద వున్న ధూమక సోమకులు చూశారు. శత్రువుల కంటబడకుండా వుండేం దుకు వాళ్ళిద్దరూ మరింత గుబురుగా వున్న చెట్లకొమ్మల్లోకి ఎగబాకారు.

''రాక్షసు డెక్కడ? వాడు పారిపోకుండా చుట్టుముట్టండి!'' అంటూ ఒక అశ్వికుడు కత్తి ఝుళిపిస్తూ సైనికుల మధ్యకు వచ్చాడు. అతడు కదంబరాజు ఉగ్రసేనుడు.

అతణ్ణి చూస్తూనే సోమకుడు పళ్ళుకొరికి బాణం ఎక్కుపెట్ట బోయేంతలో, ధూమకుడు చప్పున అతణ్ణి వారిస్తూ, చెవిలో మెల్లిగా ఏమో చెప్పాడు. అంతలో నలుగురైదుగురు కదంబ సైనికులు ఉగ్రసేనుడి దగ్గిరకు పరిగెత్తు కుంటూ వచ్చి, ''మహారాజా! రాక్షసుణ్ణిమేం గాయపరిచాం. ఇదుగో చూడండి, ఇక్కడ

'చందమామ'




భూమ్మీద నెత్తురు గుర్తులు. కాని, వాడు చీకట్లో ఏదో గుహలోకి పారిపోయాడు,'' అన్నారు.

ఉగ్రసేనుడు సైనికులు తెచ్చిన కాగడాలలో ఒకటి తీసుకుని గుహల ముందు పచ్చిక మీద వున్న రక్తపు మరకలు చూశాడు. అవి చాలా చోట్ల కనిపించినై.

''సేనానీ, ఈ రక్తం అంతా చూస్తూంటే ఇక్కడ ఏదో చిన్న యుద్ధం జరిగినట్టు కనబడుతున్నది. పగలు మనం ఈ ప్రాంతాలనే గదా కుంతలదేశ మంత్రికొడుకునూ, అతడి మిత్రుల్నీ వేటాడింది?'' అన్నాడు ఉగ్రసేనుడు.

రాజు మాటలకు సేనానాయకుడు వణికిపోతూ, ''అవును, మహారాజా! కుంతల మంత్రి కుమారుణ్ణీ, అతడి అనుచరులనూ చంపిన ధూమకుడూ, సోమకుడూ అనే ఖైదీలను మన సరిహద్దు కాపలా సైనికులు పట్టుకున్నది ఇక్కడే! ఆ హంతకు లిద్దర్నీ మన దూతలు ఆ దేశపు రాజుగారి వద్దకు తీసుకుపోయారు,'' అన్నాడు.

''ఆ దూతలు ఇంతవరకు తిరిగి రాలేదు. మన మాటలు ఆ రాజూ మంత్రీ ఎంతవరకు నమ్మారో మనకు తెలీదు. ఏది ఏమైనా, ఈ రాక్షసుడి బెడద ఒకటి ఇప్పుడు అకస్మాత్తుగా వచ్చి అడ్డుపడింది కాని, లేకపోతే ఆ కుంతల దేశాన్ని ఒక్కవారం రోజుల్లో సర్వనాశనం చేసివుండేవాణ్ణి,'' అన్నాడు ఉగ్రసేనుడు పళ్ళుకొరుకుతూ.

సేనాని ఏమో అనబోయేంతలో దాపుల వున్న కొండవాగు ప్రాంతం నుంచి కలకలం వినిపించింది. ఉగ్రసేనుడు కత్తి పైకెత్తి, ''రాక్షసుడు కొండవాగు దాటి కుంతల దేశంలో ప్రవేశించాడేమో వెతకండి. కొందరు ఈ గుహలన్నీ గాలించండి,'' అని సైనికులను ఆజ్ఞాపించాడు.

సైనికుల్లో కొందరు వాగు కేసి పరిగెత్తబోయేంతలో, వాగు వైపు నుంచి కొందరు కుంతలదేశ అశ్వసైనికులు, భయంకరంగా కేకలు పెడుతూ వచ్చి, కదంబ సైనికుల మీద పడ్డారు.

''ఇది అధర్మయుద్ధం! దొంగదాడి! నేనెవరో తెలుసా, ఉగ్రసేన మహారాజును!'' అంటూ ఉగ్రసేనుడు సింహంలా గర్జించాడు.

''అంత గొప్ప మహారాజుకు, ఈ కొండ గుట్టల్లో ఏం పని? అనుమతి లేకుండా వాగు

దాటి కుంతలదేశంలో ప్రవేశించిన ప్రతి ఒక్కడూ మాకు శత్రువే. ప్రతిఘటించ కుండా లొంగిపొండి, లేకపోతే ప్రాణాలు దక్కవు,'' అంటూ కుంతల సైనికుల నాయ కుడు కత్తిదూసి, గుర్రం మీది నుంచి కింది కురికాడు.

కదంబ సైనికులు తమ రాజు ముందు సోలుపుగా నిలబడి, ఈటెలు బారుచేశారు. కొందరు సాహసులు డాలూ కత్తితో ముందు కురికి, కుంతల సైనికులను ఎదుర్కొన్నారు. ఉగ్రసేనుడు తన రక్షణకై దడిలా నిల్చున్న సైనికులను హెచ్చరిస్తూ, కొంచెం వెనక్కు పోయి, ఒక రాతి మీద నిలబడి, వాగు కవ తల ఇంకా శత్రు సైనికులేమైనా వున్నారేమో అని పరీక్షగా చూడసాగాడు.

కుంతల, కదంబ సైనికుల మధ్య బాహా బాహి యుద్ధం భయంకరంగా సాగింది. కుంతల సైనికుల్ని కొండవాగు దాటేలా తరిమికొట్టాలని కదంబసైనికులు ప్రయత్ని స్తూంటే; కుంతల సైనికులు, వాళ్ళనూ వాళ్ళ రాజునూ చుట్టుముట్టి పట్టుకోవాలన్న పట్టుదలతో పోరసాగారు.

అంతలో తూర్పు దిక్కు తెల్లనైంది. చెట్టు కొమ్మల్లో దాక్కుని వున్న ధూమక సోమకు లకు, కొంచెం దూరంలో యుద్ధం చేస్తున్న రెండు పక్షాల సైనికులూ స్పష్టంగా కనబడ సాగారు.

''సోమూ, ఇదే మంచి అదను. ఆ పాపి ఉగ్రసేనుణ్ణి యమలోకానికి నువ్వు పంపు తావా? నన్ను పంపమన్నావా?'' అన్నాడు



ధూమకుడు. అతడు మాట పూర్తి చేసేలోపలే, సోమకుడు బాణం ఎక్కు పెట్టాడు. ''కంఠా నికి గురిచెయ్యి!'' అని హెచ్చరించాడు ధూమకుడు.

సోమకుడు బాణం ఉగ్రసేనుడి కంఠానికి గురిచేసి వదిలాడు. కాని, అదే సమయంలో వాగు కవతల పెద్ద కలకలం బయలుదేర టంతో దానిని గమనించిన ఉగ్రసేనుడు ఆత్రుతగా నిల్చున్న రాతి మీద నుంచి ఒక్క గెంతున కిందికి ఉరికాడు. సోమకుడు వదిలిన బాణం గురితప్పి, రాజు కంఠంలో కాకుండా, భుజంలో బలంగా నాటుకున్నది. బాణం దెబ్బకు ఉగ్రసేనుడు కెవ్వుమంటూ అరిచి కింద పడిపోయాడు. అతడి సైనికులు తమ రాజుకేదో ప్రమాదం కలిగిందని తెలుసు కుని, ఒక్క సారిగా వెనుదిరిగారు. అది




తడు? ఓహో, ఉగ్రసేన మహారాజుగారా? ఆశ్చర్యంగా వుంది. సభాభవనంలో కనకపు సింహాసనాన్ని అధిష్ఠించి వుండవలసినవారు, ఈ అరణ్యం మధ్య కటికనేల మీద పడి ఇలా దీనుడిలా దొర్లు తున్నారేం?'' అన్నాడు ఆశ్చర్యం నటిస్తూ.

గంగాధరుడి మాటలు వింటూనే, ఉగ్రసేనుడు లేచి కూర్చోబోయి బాధతో పెద్దగా మూలిగాడు. ఇద్దరు కుంతల సైనికులు ముందుకు వచ్చి, అతణ్ణి చేతులు పట్టుకు లేపి నిలబెట్టారు. సోమకుడు వదిలిన బాణం ఇంకా అతడి భుజంలో అలా గుచ్చుకునే వున్నది.

గంగాధరుడు ఆ బాణంకేసి వేలు చూపుతూ, ''మహారాజా! ఈ మాత్రానికే ఇంతగా బాధ పడిపోతున్నారా? మీరు ప్రయోగించిన అంబు వెన్నులో తగిలినా లెక్కచేయకుండా మా భద్రుడు ముప్పైకోసుల దూరం సునాయాసంగా ప్రయాణం చేసి, మా రాజధాని చేరాడు. రాజవైద్యుడు శస్త్రం చేసి అతికష్టం మీద అంబు బయటికి లాగుతూంటే, ఆ బాధలోనూ నవ్వుతూ నిన్న ఈ ప్రాంతాల జరిగిన విశేషాలు చెపుతూ వుండిపోయాడు,'' అన్నాడు.

భద్రుడి పేరూ, అతడికి వెన్నులో తగిలిన బాణం సంగతీ వింటూనే, ఉగ్రసేనుడు పిచ్చివాడిలా నలుమూలలకూ చూడసాగాడు. ఆ క్షణంలో అతడికి ప్రాణభయం పట్టుకున్నది. తన కొడుకును చంపినందుకు, మంత్రి గంగాధరుడు తనను కత్తితో నిలువునా చీల్చి

అదనుగా తీసుకుని కుంతల సైనికులు వాళ్ళను ఈటెలతో వెన్నుపాట్లు పొడవసాగారు. అంతలో వాగు వైపు నుంచి, దిక్కులు పిక్కటిల్లేలా ఒక కంఠస్వరం గంభీరంగా వినిపించింది: ''పారిపోయే శత్రువులను చంపవద్దు! చుట్టుముట్టి బంధించండి!''

కుంతల సైనికులు వెనుదిరిగి చూశారు. మంత్రి గంగాధరుడు కొంతమంది ఆశ్విక సైనికులతో వేగంగా ఆ ప్రదేశానికి వస్తూ వాళ్ళకు కనిపించాడు. జై జై నినాదాలు మార్మోగినై. కదంబ సైనికులు చుట్టుముట్టబడి క్షణాలలో నిరాయుధులు చేయబడ్డారు. రాజు ఉగ్రసేనుడు బాధతో నేల మీద అటూ ఇటూ దొర్లసాగాడు.

గంగాధరుడు గుర్రం దిగి, సైనికులు దారి ఇవ్వగా, ఉగ్రసేనుణ్ణి సమీపించి, ''ఎవరీ

వేస్తాడని అతడు వణికిపోసాగాడు. కాని, గంగాధరుడు చిరునవ్వు నవ్వుతూ ఒకడుగు ముందరకు వేసి, ఉగ్రసేనుణ్ణి పట్టుకునివున్న సైనికులకు అతణ్ణి రాతి మీద కూర్చోబెట్ట వలసిందిగా ఆజ్ఞాపించి, ''మహారాజా, ఇంత పుత్రశోకంలో కూడా నేను తమకు హాని తలపెట్టి మాత్రం ఇక్కడకు రాలేదు. నా కుమారుడు శశికాంతుడి శవం కనబడేంత వరకూ, నేను అతడు మరణించాడంటే నమ్మను. అదే విధంగా జయంతుడూ బతికే వున్నాడనుకుంటున్నాను. మీ ద్రోహానికి వాళ్ళెప్పుడో తప్పక పగ తీర్చుకుంటారు,'' అన్నాడు.



ఉగ్రసేనుడు దీనవదనంతో, గంగాధరుడి కేసి చూస్తూ, ''మహామంత్రీ! నిన్న ఉదయం నిద్రలేస్తూనే ఏ పాపిష్ఠిముఖం చూశానో, అన్నీ కష్టాలే. ఇక్కడికి వేటకై వచ్చి, ఘోరాతి ఘోరమైన పాపకార్యం చేశాను. రాత్రి కుమార్తెను....''

ఉగ్రసేనుడు మాట మధ్య ఆగి పోయాడు. మంత్రి గంగాధరుడు, ఉగ్రసేనుడు కూర్చున్న రాతికేసి ఒకడుగు వేసి, చప్పున వంగి, అక్కడ వున్న ఏదో ఒక వస్తువును చేతిలోకి తీసుకుని, దాన్ని పరీక్షించి చూస్తూ, ''ఏమిటిది? ఎవడో రాక్షసుడి కొమ్ము! నెత్తురింకా ఎండిపోలేదు. ఇక్కడి గుహల్లో రాక్షసులున్నారని నేనెన్నడూ వినలేదే!'' అన్నాడు ఆశ్చర్యంగా.

ఉగ్రసేనుడు, గంగాధరుడి చేతిలో వున్న కొమ్ము కేసి చూస్తూ, ''మహామంత్రీ! ఆ రాక్షసుడే రాత్రి నా కుమార్తెను కోటలో నుంచి అపహరించుకు పోయాడు. వాణ్ణి తరుముతూ నేనీ ప్రాంతానికి వచ్చాను. వాడితో నేను ముఖాముఖి తలపడింది లేదు. వాడి కొమ్ము ఎవరు తెగనరికి వుంటారు?'' అన్నాడు నివ్వెరపోతూ.

ఉగ్రసేనుడి కుమార్తె అయిన కాంతిసేన అపహరణ గురించి గంగాధరుడు ఇంతవరకూ వినివుండలేదు. ఆ సంగతి వింటూనే అతడికి ఉగ్రసేనుడి మీద ఎంతో జాలి కలిగింది. వెంటనే అతడు చేయెత్తి తనతోపాటు వచ్చిన వైద్యుణ్ణి దగ్గిరకు పిలిచి, ఉగ్రసేనుడి భుజంలో దిగివున్న బాణాన్ని చూపుతూ, ''నీ చేతనైనంతలో మహారాజుకు బాధ లేకుండా, ఆ బాణాన్ని బయటికి లాగు,'' అని చెప్పి, ఉగ్రసేనుడితో, ''మహారాజా! నా కుమారుడు గాయపడి ఈ ప్రాంతాల ఎక్కడో దొరకవచ్చు

నన్ను గట్టి నమ్మకంతో, మా రాజవైద్యుడి శిష్యుణ్ణి వెంటబెట్టుకు వచ్చాను,'' అని చెప్పాడు.

యువవైద్యుడు క్షణాల మీద ఉగ్రసేనుడి భుజంలో దిగివున్న బాణాన్ని బయటికి లాగి, గాయానికి కట్టుకట్టాడు. గంగాధరుడు ఆ బాణాన్ని చూస్తూనే, ఆశ్చర్యపోయి ఏమో అనబోయేంతలో, పక్కన వున్న సైనికనాయకుడు అతడితో రహస్యంగా ఏదో చెప్పాడు. గంగాధరుడు మరింత ఆశ్చర్యపోతూ, ''మహారాజా! మిమ్మల్ని గాయపరచినవాళ్ళూ, రాక్షసుడి కొమ్ము నరికినవాళ్ళూ ఒకరే. పితృ భ్రాతృ హంతకులని మీరు మా వద్దకు పంపిన ధూమకసోమకులకు, మా సరిహద్దు కాపలా నాయకుడు. మీ దూతల నుంచి తీసుకున్న బాణాలు ఇచ్చాడు. ఇదిగో, చూడండి, మీ రాజచిహ్నం,'' అంటూ బాణాన్ని ఉగ్రసేనుడికి చూపించాడు.

''మహామంత్రీ! వాళ్ళిద్దరూ హంతకుల వునో కాదో నాకు తెలియదు, కాని, ముమ్మాటికీ రాజద్రోహులు! వాళ్ళీ ప్రాంతాలనే ఎక్కడో పొంచిపుండి వుంటారు,'' అంటూ ఉగ్రసేనుడు తన సైనికుల కేసి తిరిగి, ''ఆ రాజద్రోహుల్ని వెతకండి!'' అని ఆజ్ఞాపించాడు.

గంగాధరుడు సైనికులను ఆగమని హెచ్చరించి, ''మహారాజా! ఇక్కడ ఆజ్ఞలివ్వవలసిన వాణ్ణి నేను, మీరు కాదు. నా కుమారుడైన శశికాంతుడు ఏమైనదీ తెలిసేవరకూ మీరంతా, శతభానుమహారాజుగారి బందీలు,'' అని చెప్పి కుంతల సైనిక నాయకుడి కేసి తిరిగి, ''మన సైనికుల చేత ఈ గుహలూ, అరణ్య ప్రాంతమంతా ఆ ధూమక సోమకుల కోసం వెతికించు. శతభాను మహారాజుగారు అభయమిచ్చారని మన సైనికులు కేకలు వేస్తూ పోతే, వాళ్ళిద్దరూ దాగినచోటు నుంచి బయట పడవచ్చు,'' అన్నాడు.

ఆ మాటలు విన్న ధూమక సోమకులు పరమానందం చెందారు. అమితోత్సాహంతో చెట్టు చిటారు కొమ్మల మీద నిలబడి, ''శతభాను మహారాజుకూ, జై!'' అంటూ ఒక పెద్ద కేకపెట్టి, కొమ్మమీంచి కొమ్మ మీదికి కోతుల్లా ఎగిరి, నేల మీదికి రివ్వున ఒక్క దూకు దూకేశారు. -(ఇంకావుంది)





# ధర్మమార్గం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ‘‘రాజా, ఎవరి మీద పగ సాధించడానికి నువ్విలా శ్రమపడుతున్నావో నాకు తెలియదు. అయితే, పగ, ప్రతీకారం అంటూ కిరాతక చర్యలకు పూనుకునేపరమదుష్టులు సైతం ఒక్కొక్క సారి వాటన్నిటికీ తిలోదకాలిచ్చి, శత్రువులతో చేతులు కలపడానికి పూనుకుంటారు. అలాంటి నిర్ణయం తీసుకున్న దండోద్ధండుడనే బోయనాయకుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,’’ అంటూ ఇలా చెప్పసాగాడు:

దండకారణ్యం తూర్పు భాగంలో నివసించే జంగిణి తెగకు చెందిన యువతులు కొందరు గూడానికి



దూరంగా వేటకు వెళ్ళారు. వేటధ్యాసలో తన జట్టుకు దూరమైపోయి ఒంటరిగా కుందేలును వెంటాడుతున్న రత్నాంగి అనే యువతికి అకస్మాత్తుగా శత్రువులైన గండోలి తెగకు చెందిన ఒక యువకుడు ఎదురయ్యాడు.

ఇరు తెగలకు చెందినవారు ఒకరికొకరు ఎదురుపడితే పోరాటం తప్పదు. చంపడమో చచ్చిపోవడమో జరగాలి. అంతేగాని, ఏ ఒక్కరూ వెనక్కు తగ్గడం ఉండదు. అలాంటిది రత్నాంగి బాణం ఎక్కుపెడితే ఆ యువకుడు ఏమాత్రం చలించకుండా చిరునవ్వుతో ఆమె వైపే చూస్తూండి పోయాడు.

''ఏమిటా వెకిలి చూపు? ప్రాణాల మీద ఆశ లేదా?'' అని అడిగింది రత్నాంగి కోపంగా.

''అపురూప సౌందర్యరాశివైన నిన్ను చూడ్డంతో నా జన్మ ధన్యమయింది. నీ చేతిలో మరణిస్తే నాకు స్వర్గమే!'' అన్నాడా యువకుడు అదే చిరునవ్వుతో.

అతడి పొగడ్తకు విస్మయం చెందిన రత్నాంగి ఎక్కుపెట్టిన బాణాన్ని వదలకుండా అలాగే నిలబడిపోయింది.

''నీ పేరు రత్నాంగి అని నాకు తెలుసు. నా పేరు దండధరుడు. నిన్ను ఇష్టపడుతున్నాను. నీకూ ఇష్టమైతే రేపు ఇదే సమయానికి ఇక్కడికిరా,'' అంటూ ఆ యువకుడు సమాధానం కోసం ఎదురు చూడకుండా మర్రి ఊడల్ని పట్టుకుని ఊగుతూ వేగంగా వెళ్ళిపోయాడు.

రత్నాంగి గూడెం కేసి బయలుదేరింది. అయినా ఆమె మనసులో దండధరుడి రూపం, మాటలు మళ్ళీ మళ్ళీ కదలాడసాగాయి.

నాలుగు రోజుల తరవాత రత్నాంగి దండధరుణ్ణి వెతుక్కుంటూ వెళ్ళింది. అతడక్కడ ఉండడం చూసి, ''ఎన్ని రోజుల నుంచి ఇక్కడే ఉన్నావు?'' అని అడిగింది.

''ఇప్పుడే వచ్చాను. నీ మనసులో నేను ఉన్నానని గ్రహించడానికి, అర్థం చేసుకోవడానికి ఈ సమయం నీకు అవసరమని నేను ముందే ఊహించాను,'' అన్నాడు దండధరుడు.

ఆ మాటకు మరింత ఆశ్చర్యపోయి రత్నాంగి సిగ్గుతో తలవంచుకున్నది. ఆ తరవాత ఇద్దరికీ మాటా మాటా కలిసింది. కొంత సేపయ్యాక, ''మనం పెళ్ళి చేసుకుందామా?'' అని అడిగాడు దండధరుడు.

''మన పెళ్ళి ఇరు తెగల మధ్య చిచ్చురేపుతుందేమోనని భయంగా ఉంది,'' అన్నది రత్నాంగి.

"రెండు తెగలనూ కలపవచ్చునని ఎందుకు అనుకోకూడదు?'' అని ఎదురుప్రశ్నవేశాడు దండధరుడు.

''అందుకు మొదట సాహసం చెయ్యాలి. నీకు అంత ధైర్యం ఉన్నదా?'' అని అడిగింది రత్నాంగి.

''నాకున్న ధైర్యం ఏపాటిదో నువ్వే స్వయంగా చూస్తావుకదా?'' అంటూ అతడు ముఖానికి మసి పూసుకుని తలపై కాకి ఈకల కిరీటం పెట్టుకుని అచ్చు జంగిణి తెగ యువకుడిలా తయారై ఆమె వెంట గూడానికి బయలుదేరాడు. రత్నాంగి తోడుగా ఉండడంతో అతణ్ణి ఎవరూ అనుమానించలేదు. రాత్రి కావడంతో రత్నాంగి ఇంట్లోనే పడుకున్నాడు.

రెండు జాముల తరవాత ఏదో అలకిడి కావడంతో రత్నాంగి నిద్ర లేచి చూస్తే దండధరుడు మెల్లగా తలుపు తెరుచుకుని వెలుపలికి వెళ్ళడం గమనించింది. వెనకగా కొద్ది దూరంలో చప్పుడు కాకుండా అతణ్ణి అనుసరించి వెళ్ళింది. దండధరుడు తిన్నగా గుడిలోకి వెళ్ళి జంగిణి కులదేవత వీరమ్మ చేతిలోని ఢమరుకాన్ని దొంగిలించడం చూసి, ఆశ్చర్యపోయి, ''నాతో ప్రేమ నటించింది ఇందుకా?'' అని అడిగింది కోపంగా.

''దుష్టశక్తి ప్రభావంతో మా గూడెంలోని ప్రజలు విషజ్వరంతో బాధపడుతూ ప్రాణాలు పోగొట్టుకుంటున్నారు. వీరమ్మ చేతిలోని ఢమరుకం తెచ్చి ఊరంతా మోగిస్తే దుష్టశక్తి నశించి జ్వరాలు తగ్గిపోతాయని కులపెద్దలు చెప్పారు. ఆ పని చేసుకుని రమ్మని మా అయ్యా నన్ను పంపాడు. వీరమ్మ ఢమరుకం



తీసుకుపోవాలన్న ఉద్దేశంతో నిన్ను వంచించిన మాట వాస్తవమే. కాని ఇప్పుడు నిన్ను నేను నిజంగానే ఇష్టపడుతున్నాను. నన్ను నమ్ము,'' అన్నాడు దండధరుడు.

అతడు నిజమే చెబుతున్నాడని రత్నాంగి నమ్మింది కాని అంతలోనే గూడెం యువకులు కొందరు అక్కడికి వచ్చి వారిని బంధించి కులపెద్ద వద్దకు లాక్కుపోయారు.

మరునాడు గూడెం జనుల మధ్య కుల పెద్ద భల్లూక దమనుడి ఎదుట నేరవిచారణ ఆరంభమయింది. గుడి పూజారి గోమాంగో, ''రత్నాంగీ, శత్రువు మాయ మాటలకు లొంగి అతడికి ఆశ్రయమిచ్చి కులద్రోహానికి పాల్పడ్డావు. నేరం అంగీకరిస్తున్నావు కదా?'' అని అడిగాడు.

''కండోలి తెగవారితో శత్రుత్వం కన్నా, మైత్రి ప్రయోజనకరమని నాకు అనిపిం



చింది. అందుకే ఇతడితో పరిచయం పెంచుకున్నాను,'' అన్నది రత్నాంగి.

''గండోలి తెగతో స్నేహమో, వైరమో నిర్ణయించవలసింది నువ్వు కాదు. మన కులపెద్ద. ఆయన అధికారాన్ని ధిక్కరిస్తున్నావా?'' అని గద్దించి అడిగాడు పూజారి.

''కులపెద్ద అధికారాన్ని ధిక్కరించేటంతటి దాన్ని కాను. అయినా ఆకాంక్షలు మొదట ప్రజలలో కలిగితే, వాటికి అనుగుణంగా ప్రభువులు నిర్ణయాలు తీసుకోవడం అరుదైన విషయం కాదు కదా? నేను చేసిన ప్రయత్నం తొలి అడుగు మాత్రమే. అది దూర ప్రయాణానికి ఆరంభం కావాలన్నదే నా ఆశ,'' అన్నది రత్నాంగి వినయంగా.

''తప్పు చేసి సమర్థించుకోవడానికి ప్రయత్నిస్తున్నావు. నిన్ను నేరస్థురాలిగానే పరిగణిస్తున్నాను,'' అంటూ పూజారి, దండధరుడి కేసి తిరిగి, ''శత్రు గూడానికి చెందిన నువ్వు మా కులదేవత చేతిలోని ఢమరుకం దొంగిలించ ప్రయత్నించి ఆలయాన్ని అపవిత్రం చేశావు. నువ్వు నేరస్థుడివి. అవునా?'' అని నిలదీశాడు కోపంగా.

''మీ అనుమతి లేకుండా మీ గూడానికి రావడం, కులదేవత ఢమరుకాన్ని తీసుకోవడానికి ప్రయత్నించడం మీ దృష్టిలో నేరాలే. అయితే, నా మాటను కూడా కొంచెం ఆలకించండి. వీరమ్మ తల్లి మహిమాన్వితమైన ఢమరుకం వల్ల కలిగే ప్రయోజనాన్ని మా గూడెం ప్రజలకు కూడా కలిగించి, ఆపదలో ఉన్న వారిని కాపాడి, దానిని మళ్ళీ యథా స్థానానికి చేర్చాలన్నదే నా ప్రయత్నం. ఆ వీరమ్మ తల్లి-అడవిబిడ్డలైన మాకూ తల్లి కాదా? అందువల్ల నా ప్రయత్నం తప్పు కాదని తమరు దయతో గ్రహించాలి,'' అన్నాడు దండధరుడు.

గోమాంగో కులపెద్ద కేసి తిరిగి, ''శత్రువు మన గూడెంలో అడుగు పెట్టడం మొదటి తప్పు. కులదేవత గుడిలోకి అన్యులు ప్రవేశించ కూడదన్నది మన కులకట్టు. గుడిలోకి ప్రవేశించడమే కాక, ఢమరుకాన్ని దొంగిలించడానికి ప్రయత్నించడం మహాపరాధం. అలాంటి నేరాలకు పాల్పడ్డ దండధరుడికి సాయపడ్డ రత్నాంగి కులద్రోహి. ఇరువురికీ మరణ దండన విధించడమే న్యాయం. అది మిగతా వారికి తగు హెచ్చరిక గానూ ఉంటుంది,'' అంటూ ముగించాడు.

కులపెద్ద తీర్పుకోసం అందరూ నిశ్శబ్దంగా ఎదురు చూడసాగారు. కులపెద్ద

కొంతసేపు మౌనంగా ఆలోచించి, ''పూజారి వాదంలో న్యాయం ఉన్నది. కాదనను కాని, రత్నాంగి, దండధరుల మాటల్లో అంతకు మించిన ధర్మం ఉన్నది. రెండు తెగలకూ సుఖశాంతులు సమకూర్చే విశాల ప్రయో జనం ఉన్నది. వారిని శిక్షిస్తే ధర్మం నశిస్తుంది. అది అందరికీ హాని కలిగిస్తుంది. అందువల్ల వాళ్ళను క్షమించడమేగాక వాళ్ళిరివురికీ వివాహం జరిపించాలనుకుంటున్నాను,'' అన్నాడు.

గుమికూడిన ప్రజలు కులపెద్ద తీర్పును ఎంతగానో హర్షించారు. గండోలి కులపెద్దకు ఈ సంగతి తెలియజేయడానికి భల్లూకదమ నుడు దూతను పంపాడు.

దూత చెప్పిన విషయం విన్నవెంటనే గండోలి కులపెద్ద దండోద్దండుడు తీవ్ర దిగ్భ్రాంతికిలోనయ్యాడు. ఆ తరవాత తేరు కుని నిదానంగా ఆలోచించసాగాడు: అందరూ అనుకుంటూన్నట్టు దండధరుడు గండోలి తెగకు చెందినవాడు కాడు. జంగిణి కుల పెద్ద భల్లూకదమనుడి ఒక్కగానొక్క కొడుకు. దండోద్దండుడు పరమ దుర్మార్గుడు. ఒకనాడు కులపెద్దతో సహా జంగిణి తెగకు చెందిన యువకులు వేటకు వెళ్ళిన సమయం చూసి అతడు ఆ గూడెంపై ఏనుగుల మందను ఉసి గొల్పాడు. పిల్లలూ, వృద్ధులూ దిక్కుతోచని భయాందోళనలలో ఉన్న సమయంలో కులపెద్ద నివాసంలో జొరబడి పసిబిడ్డగా ఉన్న కులపెద్ద కొడుకును దొంగిలించాడు. ఏనుగుల దాడిలో పలువురు మరణించడం వల్ల తన బిడ్డ కూడా చనిపోయి ఉంటాడని భల్లూకదమనుడు భావించాడు. అయితే దండోద్దండుడు బిడ్డను తెచ్చి దండధరుడని పేరు పెట్టి పెంచాడు.



ఇప్పుడు ప్రమాదకరమైన పని అప్పగించి పంపాడు. అయితే అనూహ్యమైన భల్లూకదమనుడి నిర్ణయం అతణ్ణి ఆశ్చర్యచకితుణ్ణి చేసింది.

వెంటనే అతడు గండోలి గూడెం ప్రజలను సమావేశపరచి, ''ఇక నుంచి మనం జంగిణి తెగతో మైత్రిని పాటించాలి. దానికి నాందిగా రేపు సాయంకాలం జరగనున్న రత్నాంగి–సుందధరుల వివాహానికి మనమందరం హాజరు కావాలి!'' అని ప్రకటించాడు.

బేతాళుడు ఈ కథచెప్పి, ''రాజా, రత్నాంగి–సుందధరుల మాటల్లోని వాస్తవం గ్రహించడం వల్ల భల్లూకదమనుడి ఆలోచనాధోరణిలో మార్పు రావడంలో ఆశ్చర్యంలేదు. అయితే, పరమ దుర్మార్గుడైన దండోద్ధండుడు శత్రుత్వం విడనాడడం వింతకదా? తను పెంచిన కొడుకు మీద మమకారం కారణంగా అతడిలో ఈ మార్పు వచ్చిందా? లేక తన గూడెం ప్రజలను విషజ్వరాల బారి నుంచి కాపాడాలని ఈ నిర్ణయం తీసుకున్నాడా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''దండోద్ధండుడిలో మార్పు రావడానికి ఈ రెండూ కారణాలు కావు. ప్రధానమైన కారణం మరొకటి ఉన్నది. చిరకాల వైరం తరవాత అతడికో మహత్తర సత్యం తెలియవచ్చింది. భల్లూకదమనుడు ధర్మ మార్గాన్ని అనుసరించడం వల్ల అతడికి గొప్ప మేలు జరిగింది. దాని ద్వారా అతడు తనకు తెలియకుండానే తన కొడుకును రక్షించుకున్నాడు. దండోద్ధండుడికి ప్రత్యక్షంగా ఈ విషయం రుజువయింది. సుఖశాంతులతో జీవించాలంటే ధర్మ మార్గమే సరైనదని గ్రహించాడు. తనూ ధర్మమార్గంలో నడవాలనుకున్నాడు. ఎందుకు ఏర్పడిందో కూడా తెలియని చిరకాల వైరం ఇంకా కొనసాగించడం వల్ల వినాశనం తప్ప గురివిందంత ప్రయోజనం జరగబోదని గ్రహించాడు. అందువల్లే శత్రుత్వం మాని స్నేహహస్తం అందించడానికి సంసిద్ధుడయ్యాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : గుండ్రాతి సుబ్రహ్మణ్యంగౌడు రచన]



# చందమామ కబుర్లు

## వెగటు పుట్టిస్తున్న చాక్లెట్




చాక్లెట్లంటే ఇష్టపడని పిల్లలు ఎవరుంటారు? లండనుకు చెందిన రెబెక్కా స్కోవ్‌క్రాఫ్ట్ బ్రేక్ ఫాస్ట్, లంచ్, డిన్నర్ మూడూ చాక్లెట్లతోనే సాగిస్తోంది! ఎందుకంటే ఆమె చాక్లెట్లు తప్ప మరేమీ తినజాలదు. ఆమెకు విచిత్రమైన 'ఫుడ్ ఫోబియా' ఉంది. ఇగ్లాండులో ఒక్కొక్క స్కూల్లోనూ ఒక్కొక్క విద్యార్థిని ఇలాంటి జబ్బు పీడిస్తోందని అక్కడి డాక్టర్లు చెబుతున్నారు. అయితే, అందరూ చాక్లెట్లే తినడం లేదనుకోండి. రెబెక్కా బ్రేక్ ఫాస్ట్‌గా రోజూ 15 స్క్వేయర్స్ కుకింగ్ చాక్లెట్ తింటోంది (బార్‌లుగా వచ్చేవి కావు). మధ్యాహ్నం 10 చాక్లెట్ ఫింగర్స్ తీసుకుంటుంది. కరిగించిన చాక్లెట్‌లో కలిపి ఉంటే మాత్రమే 'రైస్ క్రిస్పీస్' తింటుంది. చాక్లెట్ అంటే వెగటు పుట్టిస్తోందనే రెబెక్కా ''చాక్లెట్ నా జీవితాన్ని కష్టతరంగా చేస్తోంది,'' అంటోంది.

## మరణించడానికి ముందే విందు

కుటుంబంలో ఎవరైనా మరణించినప్పుడు కర్మకాండ పూర్తయ్యాక బంధుమిత్రులకు భోజనం పెట్టడం హిందూ కుటుంబాలలో ఒక సంప్రదాయం. వృద్ధులు మరణించినప్పుడయితే ఇది మరీ ముఖ్యంగా పాటిస్తారు. పాట్నాకు చెందిన ఫుల్జారియా కున్వర్ అనే ఒక ధనిక వృద్ధురాలు తన మరణానంతరం తన స్మృత్యర్థం విందు ఏర్పాటు చేస్తారో, లేదో అన్న అనుమానంతో ఉన్నప్పుడే గొప్ప విందుకు ఏర్పాటు చేసింది. తన గ్రామంలోనూ, చుట్టు పక్కల గ్రామాలలోనూ ఉన్న వారిని విందుకు ఆహ్వానించింది. రెండు రోజులపాటు జరిగిన విందుకు దాదాపు 1,00,000 మంది హాజరయ్యారు. అతిథులందరూ తృప్తిగా భోజనం చేసి-విందు ఏర్పాటు చేసిన పుణ్యాత్మురాలు మరణిస్తే తిన్నగా స్వర్గానికే వెళ్ళాలని మరీ ప్రార్థించి వెళ్ళి ఉంటారనడంలో సందేహం లేదు. ఈ విందు కోసం వారసులు లేని ఆ ధనిక వితంతువు పదహారు లక్షల రూపాయలు ఖర్చు పెట్టిందని చెబుతున్నారు.





# కుమారస్వామి

మాట-అర్థంలా విడదీయలేని అన్యోన్య దాంపత్యానికి ప్రతీకలు పార్వతీ పరమేశ్వరులు. ముల్లోకాలకు తల్లిదండ్రులైన ఆ ఆదిదంపతులకు ముద్దు బిడ్డడుగా ఉదయించి, లోకహితార్థం దేవసేనలకు నాయకత్వం వహించిన వీరకుమారుడు కుమారస్వామి!

వరాంగి-వజ్రాంగుల వరకుమారుడైన తారకాసురుడు తల్లి కోరిక ప్రకారం కఠోర తపస్సుచేసి బ్రహ్మ నుంచి అపూర్వ వరాలు పొందాడు. ఆ వరాల కారణంగా మూడు లోకాలనూ జయించాడు. బలగర్వంతో దేవతలను, ఋషులను, సాధువులను హింసించసాగాడు.

తారకాసురుడి బాధలు భరించలేక వాడి పీడ అంతంచేసే మార్గం చెప్పమని దేవతలు బ్రహ్మను వేడుకున్నారు. శివుడి కుమారుడు మాత్రమే తారకుణ్ణి వధించగలడని బ్రహ్మ వారికి చెప్పాడు.

ఆ సమయంలో పరమశివుడు అచంచల వైరాగ్యంతో కైలాసంలో తపో నిమగ్నుడై ఉన్నాడు. ఆయనకు తమ కుమార్తె పార్వతి చేత పరిచర్యలు చేయించాలని ఆశించిన హిమవంతుడు అందుకు శివుణ్ణి వేడుకుని ఒప్పించాడు.

పరమశివుడికి పార్వతిపై ప్రేమ అంకురింప చేయాలన్న ఉద్దేశంతో, దేవతల కోరిక ప్రకారం మన్మథుడు శివుడిపై పుష్ప బాణాలు ప్రయోగించి ముక్కంటి ఆగ్రహానికి గురై భస్మమయ్యాడు!

శివుణ్ణి పెళ్ళాడాలన్న కోరికతో పార్వతి నిద్రాహారాలు మాని కఠోర తపస్సు ప్రారంభించింది. శివుడికి కూడా క్రమంగా ఆమెపై ప్రేమ అంకురించింది. పార్వతికి తనపై ఉన్న

పురాణ వీరకుమారులు - 7

ప్రేమను శివుడు పరీక్షించాడు. ఆ తరవాత సప్తర్షుల మధ్య వర్తిత్వంతో శివపార్వతుల వివాహం నిశ్చయమయింది.

బ్రహ్మ పురోహితుడుగానూ, విష్ణువు బావ మరిదిగానూ, ఇంద్రాది దేవతలు, ఋషులు సదస్యులుగానూ శివపార్వతుల వివాహం అత్యంత వైభవంగా జరిగింది.

ఈలోపల దేవతలకు తారకాసురుడు పెట్టేబాధలు అంతకంతకు పెరగసాగాయి. దేవతలందరూ పరమశివుణ్ణి స్తుతించి ప్రసన్నుణ్ణి చేసుకుని, ''తారకుడి దుశ్చర్యలు రోజురోజుకూ మితిమీరుతున్నవి. వాణ్ణి హతమార్చడానికి నీ అంశన ఒక కొడుకును సృష్టించు,'' అని ప్రార్థించారు.

శివుడు తన అంశతో ఒక శిశువును సృష్టించాడు. ఆ శిశువును పార్వతి అనుమతితో, వాయు దేవుడు అగ్నిదేవుడి సాయంతో తీసుకువెళ్ళి, గంగా తీరంలోని రెల్లు దుబ్బలలో వదిలాడు.

అప్పుడు ముని పత్నులు ఆరుగురు అక్కడికి వచ్చి ఆ బిడ్డకు పాలుపట్టారు. బిడ్డ అందమైన ఆరు ముఖాలతో, పన్నెండు చేతులతో, దివ్య తేజస్సుగల వజ్రశరీరంతో కనిపించాడు.

బ్రహ్మ దేవుడే స్వయంగా వచ్చి ఆ బిడ్డకు కుమారస్వామి అని నామకరణం చేశాడు. స్కందుడు, షణ్ముఖుడు, గుహుడు, కార్తికేయుడు మొదలైన పేర్లు కూడా ఆ బిడ్డకు కలిగాయి.

కుమారస్వామి దినదిన ప్రవర్థమానుడై కొండల మీద తిరిగి ఆడుకుంటూ; సింహాలనూ, పులులనూ పట్టుకుంటూ, వాటి మీద ఎక్కి సవారి చేస్తూ వచ్చాడు. ఒకనాడు త్రిపురాసురులను సంహరించిన శివుడి విల్లు





కనిపించడంతో, దానిని అందుకుని వింటి తాటిని లాగి చప్పుడు చేశాడు. ఆ శబ్దానికి భయపడి దిగ్గజాలు రెండు అతడి మీద పడితే, వాటిని పట్టుకుని బంతి ఆట ఆడు కున్నాడు.

ఆ తరవాత ఆ విల్లుతో బాణాలు వేసి రాక్షసులకు స్థావరమైన క్రౌంచపర్వత శిఖ రాన్ని ఛేదించి అక్కడి రాక్షస మూకను వధిం చాడు. శూరపద్మడు, అంధకాసురుడు మొదలైన వారిని హతమార్చాడు.

ఆయనపరాక్రమాన్ని మెచ్చుకుని ఇంద్రుడు, ఐరావత భూషణమైన రెండు గంటలను తెచ్చి స్కందుడికి బహూకరించాడు.

ఆ తరవాత తండ్రి పిలుపునందుకుని పుష్పక విమానంలో కైలాస గిరిని చేరాడు. పార్వతీ పరమేశ్వరులు కుమారుణ్ణి ప్రేమతో కౌగిలించుకుని తెచ్చి తమ పక్కన కూర్చో బెట్టుకున్నారు. బ్రహ్మ కుమారస్వామిని శుభముహూర్తంలో దేవసేనకు సేనాపతిగా అభిషేకించాడు.

అప్పుడు పార్వతీ పరమేశ్వరులు, ''దేవ సేనాపతిగా దేవతలకు అండగా ఉండి దుర్మార్గులనూ, పాపాత్ములనూ సంహరించి మూడులోకాలనూ కాపాడాలి. గొప్పవాడి వనిపించుకుని గౌరవం పొందాలి,'' అని చెప్పి ఆశీర్వదించారు.

దేవతలు కుమారస్వామికి అనేకవరాలూ, అస్త్ర శస్త్ర ఆయుధాలూ ఇచ్చి, తారకాసురుణ్ణి సంహరించమని ఆశీర్వదించారు.

కుమారస్వామి దేవ, రుద్ర, వీరభద్ర, దేవీ గణాల సహితమైన దేవసేనతో బయలు దేరాడు.

అక్కడ శోణితపురంలో సంగతి తెలిసిన తారకుడు మంత్రులను సంప్రదించి యుద్ధా

నికి సన్నద్ధుడయ్యాడు. యుద్ధానికి ముందు కుమారస్వామి విశాఖుణ్ణి సంధికి దూతగా పంపాడు. అయితే, తారకుడు అధికారాన్ని వదులుకోవడానికి నిరాకరించి యుద్ధానికి సిద్ధం కమ్మని చెప్పి పంపాడు.

మరునాడు యుద్ధం ఆరంభమయింది. ఉభయ పక్షాలూ ప్రాణాలకు తెగించి పోరాడాయి. కుమారస్వామి పాశుపతాస్త్రం ప్రయోగించి రాక్షసమూకలను నిర్మూలించాడు. బ్రహ్మాస్త్ర ప్రయోగంతో తారకుణ్ణి సంహరించాడు. దేవతలు పరమానందంతో పూలవాన కురిపించారు.

తల్లిదండ్రుల ఆనతి ప్రకారం దుష్టులైన రాక్షస మూకలను నిర్మూలించి దేవతలకూ, ఋషులకూ ఆనందం కలిగించిన కుమారస్వామి మళ్ళీ కైలాసం చేరాడు.

ఆ తరవాత త్రిలోకసంచారి అయిన నారదముని ద్వారా భూలోకంలోని భిల్లురాజు పుళిందుడి కుమార్తె వల్లి అందచందాల గురించి విన్న కార్తికేయుడు ఆమెను వలచి పరిణయమాడాడు.

స్కందుడి శౌర్యపరాక్రమాలకు ముగ్ధుడైన ఇంద్రుడు ఆయనకు తన కుమార్తె దేవసేన నిచ్చి వివాహం జరిపించాడు.

సత్యం, ప్రేమ, దయ, కరుణ మొదలైన దివ్య గుణాలు కలిగి ఉన్నప్పుడు మానవ జీవితం సుఖశాంతులతో అందంగా, ఆనందంగా ముందుకు సాగుతుంది. అవి కాస్త కొరవడి అహంకారం, మదం, మాత్సర్యం లాంటి అసుర గుణాలు విజృంభించినప్పుడు శాంతి సుఖాలు దూరమై జీవితం లయ తప్పి అందవికారమై దుఃఖ భాజనమవుతుంది. ఈ స్థితిని సరిదిద్ది అసురశక్తులను తుదముట్టించి కోల్పోయిన సుఖశాంతులను, చెదిరిన అందచందాలను మళ్ళీ తీసుకురావడానికి దైవ ప్రసాదితాలయిన శక్తియుక్తులు కావాలన్న అద్భుత సత్యాన్ని జగతికి చాటిన పురాణ వీరకుమారుడు కుమారస్వామి!

అందుకే ఆయన వల్లీ దేవసేనా సమేత సుబ్రహ్మణ్యస్వామిగా ఆసేతు హిమాచల పర్యంతం గల అశేష భక్తుల పూజలందుకుంటున్నాడు!



# ఎత్తయిన ప్రదేశాల అందాలరాణి!

భారతదేశ తూరుపు సరిహద్దు ప్రాంతాల కొండ శిఖరాల మీద-ఎత్తయిన ప్రాంతాల అందాలరాణిగా ప్రసిద్ధిగాంచిన సిరాయ్ లిల్లీ పుష్ప వనం ఉన్నది. ఆ పువ్వులను ఒక్క సారి చూస్తే మళ్ళీ మళ్ళీ చూడాలనిపిస్తుంది. అందు వల్ల షిరూయ్ కొండకు వచ్చే వారి సంఖ్య యేడాదికి యేడాది పెరుగుతూ ఉంది.

ఆ పువ్వుల అందచందాలను గురించి విన్నప్పటి నుంచి అక్కడికి ఎప్పుడెప్పుడు వెళదామా అని అవిజీత్ ఆశగా ఎదురు చూడ సాగాడు. అదృష్టవశాత్తు మే నెల మధ్యలో ఇంఫాల్ నుంచి షిరూయ్ కొండకు వెళు తూన్న కొందరు యువకులతో కలిసి అక్కడికి వెళ్ళే సువర్ణ అవకాశం అవిజీత్‌కూ, అతడి మిత్రులైన విక్రమ్‌కూ, అనిల్‌కూ కలిగింది. మణిపూర్ రాష్ట్రరాజధానీ నగరం మణిపూర్‌కు 82 కి.మీ. దూరంలో పర్వత ప్రాంతమైన ఉఖ్రుల్ జిల్లాలో షిరూయ్ కొండ ఉంది.

నిటారుగా ఉన్న పర్వతం మీదికి మెలికలు తిరుగుతూ వెళ్ళే రోడ్డు మీద బస్సులో పయనిస్తూ అద్దాల కిటికీ గుండా వెలుపలికి చూసిన అవిజీత్ చెప్పలేని ఉద్విగ్నతకు లోనయ్యాడు. నయనానందకరమైన ప్రకృతి దృశ్యాలు, చల్లగా వీచే గాలులు; గాలిలో తేలుతూ వెళ్ళే అనుభూతిని కలిగించాయి.

"అదిగో ఉఖ్రుల్!" అన్నాడు అతడి మిత్రుడు అనిల్. అవిజీత్ అటుకేసి తిరిగి చూశాడు. ఉదయం పొగమంచుతో సగం దాగిన కొండపట్టణం దూరంలో కనిపించింది. వర్షాలు కురిసే ఆ వేసవిలో సైతం ఉఖ్రుల్ పట్టణం దట్టమైన పొగమంచుతో కప్పబడి ఉన్నది. వేసవిలో దుమ్ముతో, చెమటలు పట్టించే ఇంఫాల్ కూడా ఉఖ్రుల్ లాగా చల్లగా ఉంటే ఎంత బావుణ్ణు అనిపించింది అవిజీత్‌కు. ఉఖ్రుల్‌నుంచి పద్నాలుగు కి.మీ. దూరంలో ఉంది సిరాయ్ గ్రామం. రెడ్‌టీ తాగడానికి వీలుగా పట్టణంలో కొంతసేపు ఆగినబస్సు, మళ్ళీ గ్రామంకేసి బయలుదేరింది.

వాళ్ళు గ్రామాన్ని సమీపిస్తున్న కొద్దీ షిరూయ్ కొండ పెద్దదిగా కనిపించసాగింది.



దట్టమైన పొగమంచుతో మూసుకుపోయి ఉండడంతో వాళ్ళు కొండ శిఖరాన్ని చూడలేక పోయారు. కొంతసేపటికి షిరూయ్ పాదత లాన్ని చేరారు. బస్సు నుంచి దిగి తలెత్తి చూసిన అవిజీత్‌కు షిరూయ్ కొండ ఆకా శాన్ని అంటుతున్నట్టు కనిపించింది. ''ఆహా! మనం ఇంకా చాలా దూరం పైకి ఎక్కి వెళ్ళాలి,'' అన్నాడు అతడి స్నేహితులతో.

కొండ పాదతలం నుంచి పైకి వెళ్ళే మార్గం మొదట చెక్‌పోస్ట్ వద్ద కొందరు యువకులు కనిపించారు. పైకి వెళ్ళేవారికి కొందరు టిక్కెట్లు ఇస్తున్నారు. కిందికి దిగివస్తున్న వాళ్ళ సంచులను కొందరు పరీక్షిస్తున్నారు. ఆ యువకులు ఏం చేస్తున్నారా అని అవిజీత్ వారిని సమీపించి పలకరించడంతో అసలు విషయం తెలియవచ్చింది. వాళ్ళు పొరుగు గ్రామానికి చెందిన యువజన సంఘం సభ్యులు. సిరాయ్ లిల్లీ మొక్కలను, అక్కడి పరిసరాలను, ప్రాణులను పరిరక్షించడానికి ఏర్పడ్డ స్వచ్ఛంద సేవకులన్న మాట. ''ఆ పూలను, మొక్కలను కాపాడవలసిన అవసరం ఏమొచ్చింది?'' అని అడిగాడు విక్రమ్.

''పువ్వులు పూచే కాలంలో అంటే మే నెలలో వాటిని చూడడానికి మణిపూర్ నుంచి, ఇతర ప్రాంతాల నుంచి చాలా మంది వస్తూం టారు. అలా వచ్చే వారిలో కొందరు పువ్వులను కోయడం, మొక్కలను తీసుకు వెళ్ళడం కొన్నేళ్ళ క్రితం గమనించాం. అలా చేస్తే కొన్నాళ్ళకు సిరాయ్ మొక్కలు నాశనమై పోతాయి కదా. అందువల్ల వాటిని కాపాడ్డానికి తగిన జాగ్రత్తలు తీసుకోవలసిన అవసరం ఏర్పడింది,'' అన్నాడు అక్కడి ఒక యువకుడు.

''మా గ్రామంలోని యువకులు కొందరు ఆలోచించి, పైకి వెళ్ళేవారికి టిక్కెట్లు ఇస్తూ, 'మొక్కలను పాడుచేయకండి, పువ్వులు కోయకండి,' అని చెప్పి పంపాలనుకున్నాం. కిందికి వచ్చేవారి సంచులు పరీక్షించి చూసి, నియమాలు పాటించని వారిని శిక్షిస్తున్నాం. అంటే పువ్వు కోసిన వారికి యాభై రూపాయలు, ఒక చెట్టును పీక్కు వచ్చే వారికి ఐదు వందల రూపాయలు జరిమానా విధిస్తాం,'' అని ఇంకొక యువకుడు వివరించాడు.

ఆ యువకులకు పూల మొక్కల పరిరక్షణపై ఉన్న శ్రద్ధకు అవిజీత్ మిత్రులు సంతోషిస్తూ టిక్కెట్లు తీసుకుని కొండ ఎక్కబోయారు.

''ఇంకో విషయం మీకు చెప్పాలి. ఈ పూలను 'సిరాయ్' అనడం సరికాదు. 'షిరూయ్' అనే చెప్పాలి. ఉఖ్రుల్ ప్రజలు వీటిని అలాగే పిలుస్తారు. రెండవ ప్రపంచ యుద్ధం సమయంలో మా గ్రామానికి వచ్చిన కొందరు ఆంగ్లేయులు నోరు తిరక్క వీటికి 'సిరాయ్' అని పేరు పెట్టారు. నిజానికి మా టాంగ్‌ఖుల్ భాషలో ఈ పూలను 'టిమ్రవాన్' అనే పిలుస్తాం. అంటే (లిల్లీ) 'కలువపుష్పం' అని అర్థం,'' అని వివరించాడు టిక్కెట్లు రాసి ఇచ్చిన యువకుడు.

మణిపూర్ ప్రాంతంలోనే ఎన్నెన్ని భిన్నమైన భాషలు అనుకుంటూ అవిజీత్ మిత్రులతో కలిసి నిటారుకొండను పైకి ఎక్కడం ప్రారంభిం చాడు. కొంత దూరం నడిచే సరికి మిత్రులు



బాగా అలిసిపోయారు. 'మైదానాలలో తిరిగే మనం ఇలాంటి కొండలు ఎక్కలేం బాబూ!'' అన్నాడు అనిల్. ''అవును, ఈ నిటారు కొండ నా ప్రాణం తీసేస్తోంది,'' అన్నాడు విక్రమ్ గట్టిగా ఊపిరి పీలుస్తూ.

కొండ శిఖరాన్ని చేరుతూ అక్కడ కనిపించిన అందమైన దృశ్యాలను చూసి ఆశ్చర్యానందాలు పొందారు. దూరంలో సిరాయ్ కలువలు గాలికి కదులుతున్నాయి. అలసట మటు మాయమైపోయింది. నూతనోత్సాహం పుట్టుకు వచ్చింది. వాళ్ళిప్పుడు సముద్ర మట్టానికి 8,300 అడుగుల ఎత్తులో చల్లని గాలులు, చినుకుల మధ్య పచ్చగడ్డి తివాచీ మీద నిలబడి ఉన్నారు. ఎత్తయిన ప్రాంతం అందాల రాణి మధ్య అవిజీత్ మిత్రులు నిలబడి, ఇలాంటి పువ్వులు ప్రపంచంలో మరెక్కడా లేవన్న విషయం తలుచుకుని పొంగిపోయారు. అవిజీత్ ఒక్క నిమిషం కళ్ళు మూసుకుని చేతులు బార్లా సాచి నిర్మలమైన చల్లటి గాలిని గట్టిగా పీల్చుకున్నాడు. ఎంతో హాయిగా తోచింది! కొంత సేపు అటూ ఇటూ కలయ తిరుగుతూ మురిసి పోయారు. ఒక్క చిరిగిన పువ్వు, పెకలించిన మొక్క కనిపించకపోవడం చూసి మరెంతగానో ఆనందించారు.

''ఆ సిరాయ్ యువజన సంఘం సభ్యులే ఈ కొండను పరిరక్షిస్తున్నారు. ఈ పువ్వులను కాపాడేందుకు కొందరయినా ఉన్నందుకు ఆ దేవుడికి కృతజ్ఞతలు చెప్పాలి,'' అన్నాడు అవిజీత్.

ఆ కొండ అందచందాలను చూస్తూ అవిజీత్ మిత్రులు మరి కొంత సమయం అక్కడే గడిపారు. ఆ తరవాత కొండదిగి వచ్చి, ''మిమ్మల్ని చూస్తుంటేనే మాకెంతో గర్వంగా ఉంది. చాలా మంచి పని చేస్తున్నారు,'' అంటూ యువజన సంఘం సభ్యులను మనసారా అభినందించారు. వారి సంఘానికి తమ సహాయ సహకారాలు అందిస్తామని మాట ఇచ్చారు.

కొత్త మిత్రుల నుంచి వీడ్కోలు పుచ్చుకుని సంతోషంగా తిరుగుప్రయాణమయ్యారు.

- సలాం రాజేష్





# కళ్ళుండీ చూడలేని...

అక్బర్ చక్రవర్తికి నదీ ప్రవాహాన్ని చూడడం అంటే చాలా ఇష్టం. తన ఆస్థానోద్యోగులతో కలిసి ఆయన అప్పుడప్పుడు నదీ తీరానికి వాహ్యాళికి వెళ్ళేవాడు. అలా ఆయన ఒక నాడు నదీ తీరంలో నడుస్తూండగా ఆకాశంలో దట్టంగా మబ్బులు కమ్ముకున్నాయి. ఉన్న ట్టుండి వర్షం వస్తే వాళ్ళను తీసుకువెళ్ళడానికి వీలుగా చక్రవర్తి పరివారానికి కాస్త వెనగ్గా కొన్ని గుర్రపు బగ్గీలు వస్తున్నాయి. ''ఇవాళ నది చాలా ఉధృతంగా ప్రవహిస్తోంది,'' అన్నాడు చక్రవర్తి ఉరుకులతో పరుగులతో ప్రవహి స్తూన్న నదీ జలాలను చూస్తూ.

## బీర్బల్ కథలు : 16

''అవును! ప్రభువులకు లాగే దానికీ ఆగ్రహం వచ్చినట్టుంది ప్రభూ!'' అన్నాడు బీర్బల్.

''నేను ఎల్లప్పుడూ ఒకేవిధంగా ఉంటాను,'' అన్నాడు చక్రవర్తి.

''అయినా, ఎప్పుడు ఆగ్రహం వస్తుందో ఎవరూ చెప్పలేరు. మామూలుగా ఎంతో కరుణా స్వభావులైన ప్రభువులకు ఆగ్రహం వచ్చిందంటే అగ్నిపర్వతం బద్దలయినట్టే కదా? అందువల్ల తమరు కూడా ఈ నది లాంటి వారే. ఒక్కొక్కసారి ఎలా స్పందిస్తారో ఎవరూ ఊహించలేరు,'' అన్నాడు బీర్బల్.

''మరి ఆ సంగతి నాకింత వరకు అవగాహ నకు రాలేదేమిటి?'' అని అడిగాడు చక్రవర్తి.

''షహేన్‌షా, అది తమ దోషం కాదు. స్పష్టంగా కనిపిస్తున్నప్పటికీ కొన్ని సందర్భా లలో కొందరు చూడలేరు. అది సహజం!'' అన్నాడు బీర్బల్.

''విన్నారా ప్రభూ, అతడేం చెబుతున్నాడో! మనమందరం కళ్ళుండీ గుడ్డివాళ్ళంటు న్నాడు,'' అన్నాడు చక్రవర్తికీ, బీర్బల్‌కూ మధ్య మనస్తాపం కలిగించడానికి ఎప్పుడెప్పుడు అవ కాశం లభిస్తుందా అని ఎదురు చూస్తూన్న ఒక ఆస్థానోద్యోగి.

''బీర్బల్! నేను కూడా కొన్ని సమయాలలో అంధుడిలా ప్రవర్తిస్తాననా అన్నావు? ఎంత పొగరు? ఆ సంగతి నిరూపించు. లేకుంటే చావు తప్పదు,'' అన్నాడు చక్రవర్తి ఆగ్రహంతో.

''ప్రభువులు ఒక వారం అవకాశం ఇచ్చారంటే ఈ భూలోకంలో చాలా శక్తి సంపన్నులైన వారు కూడా చూపులేని వాళ్ళలా ప్రవర్తిస్తారని నిరూపించగలను,'' అన్నాడు బీర్బల్ స్పష్టమైన కంఠస్వరంతో ఎంతో వినయంగా.

''ఒక్క వారం లోపల నిరూపించాలి. లేకుంటే...'' అంటూ చక్రవర్తి అక్కడి నుంచి ఆగ్రహంతో వెనక్కు తిరిగి నడవసాగాడు.

బీర్బల్ చక్రవర్తిని అనుసరించాడుగాని, చక్రవర్తి, ''నీ ముఖం చూడ్డం నాకిష్టం లేదు,'' అంటూ వేగంగా వెళ్ళిపోయాడు.

చక్రవర్తికి ఆగ్రహంతో కళ్ళు మూసుకుపోయాయని బీర్బల్ గ్రహించాడు. ''ఆగ్రహం తగ్గడానికి కొంత సమయం పడుతుంది. అంతలో నేను చెప్పిన విషయం నిరూపించాలి. ఒక వారం ఉంది కదా!'' అనుకుంటూ బీర్బల్ మౌనంగా వెనుదిరిగాడు.

ఆగ్రహం ఎప్పుడూ అదే తీక్షణ్యంతో ఉండదు కదా. రెండు మూడు గంటల్లో చక్రవర్తి చల్లబడ్డాడు.

మరునాడు సభలో బీర్బల్ లేకపోవడం చక్రవర్తికి వెలితిగా కనిపించింది. రెండు మూడు రోజులు గడిచే సరికి అతడు త్వరగా వస్తే బావుంటుంది కదా అని మనసులో అనుకోసాగాడు.

ఏడవ రోజు ఉదయం గుర్రం మీద నదీ తీరానికి స్నానానికి వెళ్ళిన ఒక అస్థానోద్యోగి, అక్కడ వేపచెట్టుకింద కూర్చుని మంచం అల్లుతూన్న ఒక వ్యక్తిని చూశాడు. అంతకు ముందెన్నడూ అక్కడ అలాంటి దృశ్యాన్ని చూసి ఎరగడు గనక, అతడా వ్యక్తిని సమీపించి ఆశ్చర్యంతో, ''బీర్బల్!'' అని బిగ్గరగా పిలిచాడు.

బీర్బల్ తలెత్తి చూసి చిన్నగా నవ్వాడు.

''ఏం చేస్తున్నావు?'' అని అడిగాడతడు.

బీర్బల్ సమాధానం ఇవ్వలేదు. పక్కనున్న కాగితం తీసి ఏదో రాసి, మళ్ళీ అల్లిక పనిలో నిమగ్నుడయ్యాడు.

''ఇతణ్ణి ఇక అడిగి ప్రయోజనం లేదు,'' అనుకుంటూ అతడు వెనుదిరిగాడు.

ఒక గంట తరవాత ఆ ఉద్యోగి సభకు చేరుకున్నాడు. అప్పటికే సభలో చక్రవర్తితో సహా పలువురు ఆసీనులై ఉన్నారు.

చక్రవర్తికి సలాం చేసి, ''నదీతీరంలో బీర్బల్‌ను చూశాను ప్రభూ,'' అన్నాడు.



## మన దేశం క్విజ్



ఈ నెల క్విజ్ కొన్ని ఆలయాలు, స్మారక మందిరాల గురించి తెలుసుకుందాం.

1. పంజాబ్ అమృతసరోవర్ తటాకం సమీపంలో ఉన్న ఆలయం పేరేమిటి?
2. ఒక ఆలయ తటాకం మధ్య ఒక ఇత్తడి దీపం ఉన్నది. దక్షిణ భారతదేశంలోని ఆ ఆలయం ఏది?
3. ఒక సాధువు భౌతికకాయాన్ని చలవరాతి-వెండి పేటికలో భద్రపరిచారు. అది ఎక్కడ ఉన్నది? సాధువు పేరేమిటి?
4. 800 సం.ల నాటి ఈ కోటను ఒక ఎడారి మధ్య నిర్మించారు. అది ఎక్కడ?
5. పన్నెండు జతల చక్రాలతో రథాకృతిలో ఈ దేవాలయం నిర్మించబడింది. అది ఎక్కడ ఉన్నది?
6. ఈ స్మారక భవనం మధ్య ఉన్న పెద్ద గుమ్మటం మీద కాంస్య రూపం తిరుగుతూ ఉంటుంది. ఈ స్మారక భవనం పేరేమిటి?
7. ఒకే ప్రాంతంలో 194 గోంపాలా బౌద్ధ మఠాలు ఎక్కడ ఉన్నాయి?
8. ఈ మసీదులో ఖురాను మొత్తం జింక చర్మం మీద లిఖించబడి ఉన్నది. ఆ మసీదు ఏది?

*(సమాధానాలు 74వ పేజీలో)*

''స్నానం చేయడానికి వెళ్ళి ఉంటాడు,'' అన్నాడు చక్రవర్తి ఇందులో విశేషం ఏముంది అన్నట్టు.

''అతడు వేపచెట్టు నీడలో కూర్చుని దీక్షగా మంచం అల్లుతున్నాడు షహేన్‌షా!'' అన్నాడు ఉద్యోగి.

''ఏమిటి నువ్వంటున్నది?'' అని అడిగాడు చక్రవర్తి నమ్మలేనట్టు.

''అవును షహేన్‌షా. నేను చూసిందే చెబుతున్నాను. ఇది నిజం,'' అన్నాడు ఉద్యోగి.

చక్రవర్తి స్వయంగా వెళ్ళి చూడాలనుకున్నాడు. అప్పటికప్పుడే నదీ తీరానికి బయలుదేరాడు. ఆయన వెంట మరి కొందరు ప్రముఖులు, ఆస్థానోద్యోగులు బయలుదేరారు. నదీ తీరంలో వేపచెట్టు కింద మంచం అల్లుతూ బీర్బల్ కనిపించాడు.

''దగ్గరికి వెళ్ళి అతడేం చేస్తున్నాడో కనుక్కోండి,'' అని ఆజ్ఞాపించాడు చక్రవర్తి.

బీర్బల్‌కు చాలా సన్నిహితుడైన ఒక వృద్ధ ఆస్థానోద్యోగి అతణ్ణి సమీపించి పలకరించాడు. బీర్బల్ ఆయనకేసి చిన్నగా నవ్వుతూ చూశాడు. ''బీర్బల్, ఇక్కడ ఏం చేస్తున్నావు?'' అని అడిగాడాయన. బీర్బల్ మళ్ళీ చిన్నగా నవ్వాడు. అతడి నోటి నుంచి ఒక్క మాట రాలేదు. మౌనంగా పక్కన ఉన్న కాగితం తీసుకుని అందులో ఏదో రాసి అక్కడే ఉంచాడు. ఆ తరవాత మంచం అల్లడం ప్రారంభించాడు.

''అతడికి పిచ్చెక్కినట్టున్నది,'' అనుకుంటూ ఆయన చక్రవర్తి వద్దకు తిరిగి వెళ్ళి

సంగతి చెప్పాడు. తక్కిన రాజోద్యోగులు కూడా ఒక్కొక్కరుగా వెళ్ళి తిరిగి వచ్చేంతవరకు చక్రవర్తి ఆగాడు. ప్రతి ఒక్కరూ అదే ప్రశ్న అడిగారు. బీర్బల్ నవ్వుతూ కాగితంలో ఏదో రాసుకున్నాడు తప్ప, నోరువిప్పిన పాపాన పోలేదు.

''అతడు మూగవాడైపోయాడా?'' అంటూ ఆశ్చర్యపోయాడు మరొక ఉద్యోగి.

ఆ తరవాత చక్రవర్తి స్వయంగా అసలు సంగతి తెలుసుకోవాలని, ''బీర్బల్,'' అని పిలుస్తూ అతణ్ణి సమీపించాడు.

బీర్బల్ చేతుల్లో ఉన్న నవారును అలాగే వదిలి లేచి నిలబడి సలాం చేశాడు.

''బీర్బల్, నువ్వు ఏం చేస్తున్నావు?'' అని అడిగాడు.

బీర్బల్ చిన్నగా నవ్వుతూ పక్కనున్న కాగితాన్ని అందుకుని ఏదో రాసి పెట్టాడు.

''కాగితంపై ఏం రాశావు?'' అని అడిగాడు చక్రవర్తి ఎంతో ఆత్రుతగా.

''కళ్ళుండీ, కళ్ళు లేనివారిలా ప్రవర్తించే వారి జాబితాకు తమ పేరును కూడా చేర్చాను షహేన్‌షా,'' అంటూ బీర్బల్ ఆ జాబితాను చక్రవర్తికి అందించాడు.

''జాబితాలో నా పేరును కూడా చేర్చావా?'' అని కోపంగా అడిగాడు చక్రవర్తి.

''అవును షహేన్‌షా. మంచం అల్లడం కళ్ళారా చూస్తూనే, 'నువ్వేంచేస్తున్నావు?' అని అందరిలాగే తమరూ అడిగారు కదా ప్రభూ! రెండు కళ్ళతో చూస్తూనే... ఏం చేస్తున్నావని అడగవలసిన అవసరం ఏమిటి?'' అని అడిగాడు బీర్బల్. అక్బర్ చక్రవర్తి అతి ప్రయత్నం మీద వచ్చే కోపాన్ని దిగమింగుకుని ఆలోచనలో పడ్డాడు.

''మనలో చాలా వివేకసంపన్నులనుకునే వారు కూడా అప్పుడప్పుడు అంధుల్లా నడుచుకుంటారని నేను గతవారం చెప్పాను. మీకు ఆగ్రహం వచ్చి నన్ను దాన్ని నిరూపించమని ఆజ్ఞాపించారు. నిరూపించాను గనక, ఇప్పుడు నన్ను క్షమించగలరనే భావిస్తున్నాను. అంధులు కాక పోయినప్పటికీ అందరూ ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక సందర్భంలో కళ్ళు లేనివాళ్ళలాగే ప్రవర్తిస్తారని నేను ఇంకా దృఢంగా విశ్వసిస్తూనే ఉన్నాను,'' అన్నాడు బీర్బల్ చాలా వినయంగా.

''అవును, నువ్వు చెబుతున్నది నిజమే, బీర్బల్,'' అంటూ బిగ్గరగా నవ్వాడు అక్బర్ చక్రవర్తి.



ఉదయ తారలు:

# అనకా అలంకామోని



- అనకా రోజుకు నాలుగు గంటలు అంటే స్కూలుకు వెళ్ళడానికి ముందు రెండు గంటలు; తిరిగి వచ్చాక రెండు గంటలు శిక్షణ పొందుతోంది.
- నేషనల్ స్క్వాష్ కోచ్ సైరస్ పోన్చా ఆమె కోచ్. ఆమె చెన్నయ్ ఐసిఎల్ స్క్వాష్ అకాడెమీలో శిక్షణ పొందుతోంది.
- వరల్డ్ జూనియర్ టైటిల్‌ను ప్రప్రథంగా రెండుసార్లు సాధించిన వరల్డ్ నంబర్ 1 స్క్వాష్ ప్లేయర్ నికోల్ డేవిడ్ ఆమె రోల్ మోడల్.
- అనకా అభిమాన పాఠ్యాంశం : గణితం.



గెలుపొందిన మేజర్ టైటిల్స్ :
మలేషియన్ ఓపెన్ : 2004, 2005, 2006.
పెనాంగ్ ఓపెన్ : 2005, 2007.
సింగపూర్ ఓపెన్ : 2005.
స్కాటిష్ ఓపెన్ : 2005.
యు-15 ఏషియన్ జూనియర్ 2008 ఛాంపియన్‌షిప్.

అనకా ఆరేళ్ళ వయసులో టెన్నిస్ ఆడడం ప్రారంభించింది. ఆ క్రీడను మూడేళ్ళు అభ్యసించాక స్క్వాష్‌కు మారిపోయింది. (ఎందుకో తెలుసుకోవాలంటే పక్కనున్న ట్రివియా చూడండి.) ఎంతో ఆత్మవిశ్వాసంగల ఈ పధ్నాలుగేళ్ళ అమ్మాయి పలు అంతర్జాతీయ టైటిల్స్ సాధించింది. తాను సాధించినవాటిలో యు-15 ఏషియన్ జూనియర్ ఛాంపియన్‌షిప్ (2008)ను చాలా కష్టమైన టోర్నమెంటుగా ఆమె భావిస్తోంది. తొలిరెండు ఆటలలో నెగ్గలేక పోయినప్పటికీ విశ్వాసాన్ని కూడదీసుకుని మూడో గేమ్‌లో ప్రత్యర్థిని ఓడించ గలిగింది.

ఆటలాడడం జీవితాన్ని ఎదుర్కోవడానికి మనల్ని సమాయత్తం చేస్తుందని అనకా విశ్వసిస్తుంది. ''ఆటల్లో గెలుపు ఓటములు, ఎత్తు పల్లాలు, ఒడి దుడుకులు, ప్రత్యర్థుల ఈర్ష్యాద్వేషాలు, లక్ష్యాలను అందుకున్నప్పుడు ఆనందానుభూతులు ఎన్నో ఎదురవుతాయి. జీవితం కూడా అలాంటిదే కదా?'' అంటుంది అనకా.

చెన్నయ్ చర్చ్‌పార్క్ కాన్వెంటులో పదవ తరగతి చదువుతూన్న అనకా ఉదయం స్క్వాష్ ప్రాక్టీస్ చేయవలసి ఉండడంతో రోజూ 9.30 గం.లకు స్కూలుకు రావడానికి ప్రత్యేక అనుమతి తీసుకున్నది. పాఠశాల యాజమాన్యం, సహవిద్యార్థులు ఆమె ఆటలో రాణించడానికి ఎంతో సహకరిస్తున్నారు.

అనకా విజయాలకు వెన్నుదన్నుగా ఉన్న ఆమె తల్లి చిత్రా అలంకామోని తన కూతురును గురించి చెబుతూ, ''ప్రతి చిన్నారీ ఏదో ఒక ఆటను అభ్యసించాలి. అలాంటి క్రమశిక్షణను అలవరచుకోవడం వాళ్ళకు అన్ని విధాలా మంచిది. చదువులూ, ఆటల తరవాత కూడా అనకాకు ఎంతో సమయం మిగిలి ఉంటోంది. ఆమె దానిని సక్రమంగా, సంతోషంగా ఉపయోగించుకుంటోంది'' అన్నారు.

ఈ ఉదయతార చందమామ ఈ నెల సెల్యూట్‌ను అందుకుంటోంది!

# పొగబరువు

ప్రతాపగఢ్‌ను పరిపాలించే రాజాధిరాజుకు జ్యోతిషం పట్ల అపార విశ్వాసం ఉండేది. గ్రహాల స్థితిగతులు, ప్రభావాలను బట్టే ఒక్కొక్కరి చర్యలూ ఆధారపడి ఉంటాయని ఆయన దృఢంగా విశ్వసించేవాడు. జ్యోతిష్కులను కానుకలతో సత్కరించి పంపేవాడు.

ఒకనాడు బ్రహ్మాచారి అనే ఒక జ్యోతిష్కుడు వచ్చి తన జ్యోతిష పరిజ్ఞానంతో రాజును అబ్బుర పరిచాడు. వెంటనే రాజు అతణ్ణి ఆస్థాన జ్యోతిష్కుడిగా నియమించాలని నిర్ణయించి ఆ సంగతి అతనికి చెప్పాడు. అతడు అంగీకరించడంతో వెంటనే ఆస్థాన జ్యోతిష్కుడి నియామకం జరిగిపోయింది. ఆ క్షణం నుంచి రాజు సదా సర్వవేళలా బ్రహ్మాచారి జ్యోతిష్కుడితో జ్యోతిషం గురించి చర్చిస్తూ కాలం గడపసాగాడు. రాజుగారికి జ్యోతిషం పట్ల గల ఆసక్తిని ఒక బలహీనతగా గ్రహించిన బ్రహ్మాచారి దానిని తన స్వార్థప్రయోజనాల కోసం వినియోగించుకోసాగాడు.

రాజాధిరాజు ఆస్థానంలోని ప్రధాన మంత్రి సత్యరాజు వివేక సంపన్నుడు. రాజుగారు ఎప్పుడు చూసినా జ్యోతిష విషయాలను చర్చించడంలో తలమునకలుగా ఉంటూ పరిపాలనా వ్యవహారాలను ఉదాసీనపరచడం ఆయనకు ఇబ్బంది కలిగించింది. ముఖ్యమైన నిర్ణయాలు తీసుకోవడానికి రాజును కలుసుకోలేక పోవడం వల్ల బాధ్యతానిర్వహణలో జాప్యం కలగసాగింది.

రాజు జ్యోతిష్కుడితో చర్చిస్తున్నప్పుడు మంత్రి అక్కడికి వెళితే ఆయన విసుక్కోవడం మంత్రికి మరింత ఆశ్చర్యం కలిగించింది. పైగా దీనిని అవకాశంగా తీసుకుని మంత్రికీ,





రాజుకూ మధ్య విభేదం సృష్టించి రాజుకు తాను మరింత చేరువ కావాలని జ్యోతిష్కుడు ఆలోచించసాగాడు.

ఒకనాడు రాజు సభలో కొలువుతీరి ఉండగా ఆస్థాన జ్యోతిష్కుడు లేచి నిలబడి, ''ప్రస్తుత గ్రహస్థితులను బట్టి చూస్తే రాబోయే మూడు నెలలలో తమ రాజ్యానికి ఏదో ప్రమాదం ముంచుకురానున్నదని తోస్తున్నది,'' అన్నాడు.

నిన్నటి వరకు ఆ సంగతి గురించి అసలు నోరు విప్పని జ్యోతిష్కుడు హఠాత్తుగా హెచ్చరించడం. రాజుకు దిగ్భ్రాంతి కలిగించింది. తన చెవులను తనే నమ్మలేకపోయాడు.

''ఎలాంటి ప్రమాదం?'' అని అడిగాడు రాజు అమితాశ్చర్యంతో.

''తూర్పు దిశ నుంచే ఆ ప్రమాదం వచ్చే అవకాశం బలంగా కనిపిస్తున్నది,'' అన్నాడు జ్యోతిష్కుడు.

''తూర్పు దిశ నుంచా?'' అని ఆశ్చర్యపోయాడు రాజు.

''అవును ప్రభూ. తూర్పు సరిహద్దు రాజ్యంలోని రాజు దండెత్తి రావడానికి ఆలోచిస్తున్నట్టు గ్రహగతులు సూచిస్తున్నాయి,'' అన్నాడు జ్యోతిష్కుడు.

రాజాధిరాజు మంత్రి కేసి తిరిగి, ''దీని గురించి తమకేదైనా సమాచారం అందినదా మంత్రివర్యా,'' అని అడిగాడు.

''తూర్పున వీరపురిని ఆనుకుని ఉన్న సరిహద్దులు పకడ్బందీగా రక్షింప బడుతున్నాయి. గూఢచారుల నుంచి కూడా ఎలాంటి వర్తమానమూ రాలేదు ప్రభూ!'' అన్నాడు మంత్రి.

''అంటే ఆస్థాన జ్యోతిష్కుడు అబద్ధం చెబుతున్నాడని తమరు భావిస్తున్నారా?'' అన్నాడు రాజు ఆగ్రహంతో కనుబొమలు ముడిచి.

పరిస్థితిని అర్థం చేసుకున్న మంత్రి ప్రత్యక్షంగా సమాధానం ఇవ్వకుండా, ''ప్రభూ! ఈ క్షణం వరకు వీరపురి రాజుతో మనకు చక్కటి స్నేహసంబంధాలు నెలకొని ఉన్నాయి. ఆయన మన రాజ్యం మీద హఠాత్తుగా దండెత్తి రాగలడనడానికి నాకెలాంటి కారణమూ కనిపిం

చడం లేదు,'' అన్నాడు ఎంతో వినయంగా.

రాజాధిరాజుకు ఆ మాట అంత నమ్మ శక్యంగా తోచలేదు. ఆయన ఆస్థాన జ్యోతిష్కుడి కేసి తిరిగి, ''ఈ ప్రమాదాన్ని అధిగమించే మార్గం తమరే సూచించాలి పండితవర్యా,'' అన్నాడు.

''పురాతన జ్యోతిష గ్రంథాలను పరిశీలించి తగిన పరిష్కారం సూచిస్తాను, ప్రభూ!'' అంటూ జ్యోతిష్కుడు రాజు నుంచి సెలవు తీసుకున్నాడు.

మరునాడు ఉదయం జ్యోతిష్కుడు ఒంటరిగా రాజును దర్శించి, ''ప్రభూ, గ్రంథాలన్నిటినీ పరిశీలించి అద్భుతమైన పరిష్కార మార్గం కనుగొన్నాను. తూరుపు దిశగా గాలి వీస్తున్నప్పుడు పవిత్ర అగ్నిని ప్రజ్వలింపజేసి ఈ పవిత్ర మూలికను అందులో వేయాలి. అయితే... అయితే...'' అంటూ ఆగిపోయాడు.

''అయితే ఏమిటి? నిస్సంకోచంగా చెప్పు,'' అన్నాడు రాజు.

''ఈ బొగ్గు ముక్క నుంచి వెలువడే పొగ బరువంత మూలికను మాత్రమే అగ్నిలో వెయ్యాలి. గురివిందంత ఎక్కువగానీ, తక్కువగానీ ఉండకూడదు,'' అంటూ పెద్ద బొగ్గు ముక్కను రాజు ముందుంచాడు జ్యోతిష్కుడు.

''పొగబరువంతా? పొగ బరువును కనుగొనడం ఎలా?'' అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

''వివేకవంతుడైన మన ప్రధాన మంత్రి దీనికి సరైన మార్గం కనుగొనగలడనే నమ్మకం నాకు ఉన్నది ప్రభూ,'' అన్నాడు జ్యోతిష్కుడు.

రాజు సరేనన్నట్టు తల పంకించడంతో, ప్రధాన మంత్రి చిక్కులో పడ్డాడనీ, ఈ దెబ్బతో ఆయన రాజుగారి అసంతృప్తికీ, ఆగ్రహానికి గురికావడం తథ్యమనే నమ్మకంతో జ్యోతిష్కుడు అక్కడి నుంచి సంతోషంగా బయలుదేరాడు.

రాజు మంత్రిని పిలిపించి, ''ఈ బొగ్గు ముక్కను కాలిస్తే వెలువడే పొగ బరువెంతో కనుగొనాలి,'' అన్నాడు ముక్తసరిగా బొగ్గుముక్కను ఇస్తూ.

మంత్రి రాజభవనానికి వస్తూ అంతకు ముందే ఆస్థాన జ్యోతిష్కుడు వచ్చి రాజుతో మాట్లాడి వెళ్లాడని కాపలా భటులు చెప్పగా విన్నాడు. అందువల్ల, ఈ పొగ బరువు వ్యవహారమంతా జ్యోతిష్కుడి చలవే అని అతడు సులభంగానే ఊహించగలిగాడు. అందువల్ల, ''పొగ బరువే కదా.. అలాగే కనుగొంటాను ప్రభూ,'' అని చెప్పి రాజు వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

రెండు రోజుల తరవాత ఒక త్రాసుతో రాజును చూడడానికి వచ్చిన మంత్రి, ''ప్రభూ, ఈ బొగ్గు ముక్కలో ఉన్న పొగ బరువును తెలుసుకునే పద్ధతి కనుగొన్నాను. మొదట ఈ



బొగ్గు బరువును తూచాలి. ఆ తరవాత బొగ్గును కాల్చినట్టయితే దానిలోని పొగ బయటకు వెళ్ళిపోతుంది. అప్పుడు మిగిలి ఉన్న బూడిద బరువెంతో తూచి తెలుసుకోవాలి. ఆ పిమ్మట బొగ్గు బరువు నుంచి, బూడిద బరువును తీసివేస్తే అందులోని పొగ బరువు వస్తుంది,'' అన్నాడు. ఆ తరవాత చెప్పినట్టే బొగ్గును తూచి, దానిని కాల్చాక, బూడిద బరువును తూచి, తీసివేత చేసి, ''పొగ బరువు పది తులాలు ప్రభూ,'' అన్నాడు.

దానిని చూసి పరమానందం చెందిన రాజు, ''తమరు నిజంగానే చాలా తెలివైనవారు,'' అని మెచ్చుకుని జ్యోతిష్కుడి వైపు తిరిగి, ''నువ్వు మూలికల పొగ వేయడానికి పవిత్ర అగ్నిని ఎప్పుడు రగిలించనున్నావు?'' అని అడిగాడు.

మంత్రి పొగ బరువును కనుగొనగలడని ఊహించలేకపోయిన జ్యోతిష్కుడు దిక్కు తోచక నేల చూపులు చూడసాగాడు. అప్పుడు మంత్రి మళ్ళీ, ''ప్రభూ! పొగ బరువును కనుగొనే పద్ధతిని మన రాజగురువు ఒక ప్రాచీన జ్యోతిష గ్రంథంలో చదివి నాకు చెప్పారు. అందులో మరొక సూచన కూడా కనిపించింది. పవిత్ర అగ్నిని రగిలించే జ్యోతిష పండితుడు, తన వట్టి చేతులతో ఆ అగ్ని భాండాన్ని ఎత్తి చూపినప్పుడే అది సత్ఫలితాలనిస్తుందని ఆ గ్రంథంలో ఉందని చెప్పారు,'' అన్నాడు.

ఆ మాట వినగానే జ్యోతిష్కుడు హడలి



పోయి రాజు పాదాలపై పడి, ''క్షమించండి ప్రభూ! పొరుగు రాజు దండెత్తి వస్తున్నాడని అబద్ధం చెప్పాను. రాజ్యానికి గ్రహ గతులు సక్రమంగానే ఉన్నాయి,'' అన్నాడు.

రాజు దిగ్భ్రాంతి చెందాడు. ఆ తరవాత తేరుకుని, ''నిన్ను క్షమిస్తున్నాను. అయితే, ఇంకొక క్షణం కూడా నా రాజ్యంలో ఉండ కూడదు,'' అని ఆజ్ఞాపించాడు.

తరవాత రాజు లేచి, ''తమతో చర్చించవల సిన విషయాలు చాలా ఉన్నాయి మంత్రివర్యా. రండి వెళదాం,'' అంటూ మంత్రిని వెంటబెట్టు కుని బయలుదేరాడు.

## చందమామ క్విజ్ - 9 సమాధానాలు

1. ఐర్లండ్ రాజ్యాంగం నుంచి 2. బ్రిటిష్ పార్లమెంట్ 3. సాధారణ సమయాలలో అది ఫెడరల్ విధానం; అత్యయిక స్థితిలో ఏకీకృతం అవుతుంది 4. 35 సం.లు. 5. బ్రిటన్‌కు లిఖితపూర్వకంకాని రాజ్యాంగం 6. కాలేదు 7. వీలుకాదు 8. 1950 జనవరి 24 9. రాష్ట్రపతి 10. అమెరికా రాజ్యాంగం.



# సత్యదేవుడి వరాలు

హరిపురంలో ఉండే ముత్యాలుది కొబ్బరి కాయల వ్యాపారం. తగు మాత్రం లాభానికి నాణ్యమైన సరుకు ఇస్తాడని అంతా ఆయన్ను గౌరవిస్తారు. ఉన్నంతలోనే పదిమందికి సాయ పడుతున్న ఆయన వ్యాపారంలోనూ రాణించి లక్షరూపాయల దాకా కూడబెట్టాడని పొరుగున ఉండే వజ్రాలు తెగ అసూయ పడు తూండేవాడు.

వజ్రాలుది బియ్యం వ్యాపారం. ధర హెచ్చు చెబుతాడు; బియ్యంలో రాళ్ళు కలుపుతా డని జనం చెప్పుకుంటారు. అలాంటి వజ్రాలు ఇంటికి వ్యాపారంలో చితికిపోయి అప్పుల పాలైన ధనాంశుడనే దూరపు బంధువు వచ్చి ఆయన సాయం అర్థించాడు.

వజ్రాలు, ''ప్రస్తుతం నేను నీకు సాయ పడే స్థితిలో లేను. కానీ, నా పొరుగున ఉన్న ముత్యాలు పరోపకారి. ఆయన నీకు తప్పక సాయపడగలడు,'' అని చెప్పి ధనాంశుణ్ణి ముత్యాలు దగ్గరికి తీసుకు వెళ్ళి పరిచయం చేశాడు.

ఉపకారబుద్ధిగల ముత్యాలు ధనాంశుణ్ణి కొన్నాళ్ళు తన ఇంట్లో ఉండమన్నాడు. ధనాం శుడు అందుకు ఒప్పుకోకుండా, ''రాజధా నిలో కొత్తగా వ్యాపారం ప్రారంభించాలనుకుం టున్నాను. పెట్టుబడికి పదివేల రూపాయలు కావాలి. నన్ను నమ్మి ఆ డబ్బు అప్పుగా ఇస్తే, మీ మేలు మరువను,'' అన్నాడు.

ఏం చేయమంటావు అన్నట్టు వజ్రాలు కేసి చూశాడు ముత్యాలు.

''ధనాంశుడు మంచివాడని హామీ ఇస్తాను. కానీ అదృష్టం విషయంలో ఎవరూ హామీ ఇవ్వలేరు కదా? అందుకని అప్పు విషయంలో నన్ను హామీ అడగవద్దు,'' అని ఖచ్చితంగా చెప్పేశాడు వజ్రాలు.

''వసుంధర''



పరిస్థితిని అర్థం చేసుకున్న ముత్యాలు, ''నువ్వు మంచి వాడివైతే అదృష్టం నిన్ను వెతుక్కుంటూ వస్తుంది. వ్యాపారంలో వృద్ధి లోకి వస్తే నా బాకీ తీర్చు. నష్టపోతే నాది సాయ మనుకుని అప్పు సంగతి మరిచిపో,'' అని ధనాంశుడికి పదివేల రూపాయలిచ్చి పంపాడు.

ముత్యాలు ఆస్తిలో పదివేల రూపాయలు తగ్గిపోయింది కదా అని మనసులో అపరి మిత ఆనందం పొందాడు వజ్రాలు.

పదేళ్ళు గడిచాయి. అప్పటికి వజ్రాలు ఆస్తి రెట్టింపయింది. ముత్యాలు ఆస్తి కూడా పెరగడం చూసి అసూయతో దిగులు పడ్డ వజ్రాలు ముత్యాలును మించడానికి మార్గా లేమిటా అని ఆలోచించసాగాడు. ఆ సమ యంలో ఆయన కోసమే అన్నట్టు ఆ ఊళ్ళో ఒక విచిత్రం జరిగింది.

ఒక బాటసారి ఊరి చివర రావిచెట్టు కింద, వెంట తెచ్చుకున్న రొట్టెలు తింటూండగా, దగ్గర కాకి వాలడంతో దాన్ని తరమడానికి కోపంగా చెయ్యి విదల్చగా, వేలికున్న వజ్రపు టుంగరం ఊడి, కాస్త దూరాన ఉన్న పుట్టలో పడింది. బాటసారి లబో దిబో మంటూ చుట్టు పక్కల వాళ్ళను పిలిచాడు. కొందరు గ్రామ స్థులు పుట్టను తవ్వగా అందులో నుంచి ఉంగ రంతో పాటు ఒకదేవుడి విగ్రహం, శిలాఫలకం బయటపడ్డాయి. శిలాఫలకంలో, ''అడిగిన వారి కోరిక తీర్చే సత్యదేవుడి విగ్రహం ఇది. పూజారి ద్వారా కోరికను విన్నవిస్తే, సత్యదేవుడు కుటుంబానికి ఒకే ఒక్క కోరిక తీరుస్తాడు. కోరిన వారి ఉద్దేశం మంచిదయితే కోరిక సత్ఫలితాన్నిస్తుంది. చెడ్డదయితే, కోరిన వాళ్ళు చెడును విడనాడేదాకా శాపమై వేధి స్తుంది,'' అని రాసి ఉంది.

ఈ విషయం గ్రామాధికారిని చేరింది. ఆయన విగ్రహం చుట్టూ చిన్న గుడి కట్టించి, పూజారిని నియమించాడు. సత్యదేవుడి మహిమతో ఒకడికి పోయిన కంటి చూపు వచ్చింది. మరొకడికి ధనలాభం కలిగింది. సత్యదేవుడి దర్శనం కోసం పొరుగూళ్ళ నుంచి కూడా భక్తులు రాసాగారు.

ముత్యాలు కూడా ఒకసారి భార్యా పిల్ల లతో వెళ్ళి సత్యదేవుణ్ణి దర్శించుకుని వచ్చాడు. ఏమికోరుకున్నావని మిత్రులడిగితే, ''నా భార్య అనుకూలవతి. నా బిడ్డలు ప్రతిభావం తులు. బట్టకూ, తిండికీ లోటు లేదు. ఇలా ఆశించినవన్నీ లభించినందుకు కృతజ్ఞతలు

చెప్పుకునేందుకే సత్యదేవుణ్ణి దర్శించుకు న్నాను,'' అన్నాడాయన.

ముత్యాలుకు ఉన్నవన్నీ వజ్రాలుకు ఉన్నాయి. అయినా ఆస్తిలో ముత్యాలును మించేదాకా ఆయనకు తృప్తిలేదు. ఆయన సత్యదేవుణ్ణి దర్శించి తన ఆస్తి పదిలక్షలకు పెరగాలని కోరుకున్నాడు. మూడో రోజు వజ్రాలు పెరట్లో గొయ్యి తవ్విస్తుంటే లంకెల బిందెలు దొరికాయి. వాటిలో ఉన్న మణుల విలువ పది లక్షలు. ఇప్పుడు తన మొత్తం ఆస్తి పన్నెండు లక్షల రూపాయలనీ, ముత్యాలును మించి పోయానన్న సంతోషంతో వజ్రాలు ఉబ్బి తబ్బిబ్బయ్యాడు.

ఆ తరవాత రెండు రోజులకు-పదేళ్ళ క్రితం రాజధానికి వెళ్ళిన ధనాంశుడు హరిపురానికి వచ్చి ముత్యాలుకు తన కథ చెప్పాడు:

కొత్తవ్యాపారం ప్రారంభించడానికిముహూర్తం కోసం జ్యోస్యుడి వద్దకు వెళ్ళాడు ధనాంశుడు. జ్యోస్యుడాయన జాతకం చూసి, ''ఇప్పట్లో నీకు వ్యాపారం అచ్చిరాదు. నీ వాటాను రెండు వాటాలు చెయ్. ఒకవాటాతో నీ పేరున వ్యాపారం చేసి, వచ్చిన లాభాల్లో పూర్తి వాటా తీసుకో. రెండో వాటాతో నీ కుటుంబానికి చెందని ఒక సత్పురుషుడి పేరున వ్యాపారం చేసి-వచ్చే లాభంలో సగం వాటా తీసుకో. నీ వ్యాపారంలో పెట్టుబడి రెట్టింపయినప్పుడు నీ జాతకం మారిందనుకో. అప్పుడా సత్పురుషుడి వాటా ఆయనికిచ్చెయ్. మళ్ళీ నిన్ను అదృష్టం వరిస్తుంది. ఇవ్వకపోయావో పతనం తప్పదు,'' అని సలహా ఇచ్చాడు.



ధనాంశుడు తనకు ముత్యాలు ఇచ్చిన డబ్బును రెండు సమాన వాటాలు చేశాడు. ఒక వాటాతో తన పేరు మీదా, రెండో వాటాతో ముత్యాలు పేరు మీదా వ్యాపారం మొదలు పెట్టాడు. తన పేరు మీది వ్యాపారంతో పెట్టుబడిమొనక్కు రావడమే కష్టమయ్యేది. ముత్యాలు పేరు మీద ఏ వ్యాపారం చేసినా, మంచి లాభాలు రాసాగాయి. పదేళ్ళ తరవాత ధనాంశుడి పేరు మీది వ్యాపారం కూడా పుంజుకుని పెట్టుబడి పదివేల రూపాయలయింది. దాంతో జ్యోస్యుడి సలహా ప్రకారం ముత్యాలు పేరున చేసిన వ్యాపారంలో సగం వాటా ముత్యాలుకు ఇవ్వాలని వచ్చాడు ధనాంశుడు.

అంతా విన్న ముత్యాలు చిన్నగా నవ్వుతూ, ''నువ్వు పతనం కాకుండా ఉండాలి కాబట్టి నీ దగ్గర డబ్బు తీసుకుంటాను. నా వాటా

లాభం ఏమాత్రం ఉందేమిటి?'' అని గాడు. ''పదిహేను లక్షల రూపాయ అన్నాడు ధనాంశుడు.

ఈ సంగతి తెలిసిన వజ్రాలు పట్టల ఆవేశంతో పూజారి వద్దకు పరుగున వెళ్ళి, ''అడిగానని నా ఆస్తి పదిలక్షలు చేశాడు సత్యదేవుడు. అడక్కుండానే ముత్యాలుకు పదిహేను లక్షలిచ్చాడు. ఇదెలా సాధ్యమయింది? నువ్వు నా వద్ద నిజం దాచావు లాగుంది,'' అని నిలదీశాడు.

పూజారి కళ్ళు మూసుకుని కొంత సేపు సత్యదేవుణ్ణి స్మరించి, కళ్ళు తెరిచి, వజ్రాలు వంక జాలిగా చూస్తూ, ''నువ్వు అవసరం లేకపోయినా ఆస్తిలో ముత్యాలును మించాలన్న దురుద్దేశంతో సత్యదేవుణ్ణి ఆ వరమడిగావు. దాని ఫలితమే ముత్యాలుకు ధనలాభం. అదాయనకు వరం కాదు. నీకు శిక్ష. ధనాంశుడు అడిగినప్పుడు సాయపడి ఉంటే, ఈ రోజు నీ వద్దకు పదిహేను లక్షలు వెతుక్కుంటూ వచ్చేవి. అలా చేయలేకపోయావు. పైగా పొరుగువాడికన్నా ఎక్కువ ఉండాలని తపించినంత కాలం దేవుడు నిన్నిలా వేధిస్తూనే ఉంటాడు. మంచి ఆలోచనలతో ఉన్నదానికి తృప్తి పడడం నేర్చుకుంటేనే నీకు విముక్తి,'' అన్నాడు.

ఈ విషయం ఊరంతా పాకింది. పలువురు ముత్యాలు మంచితనాన్నీ, అదృష్టాన్నీ పొగడడానికి వెళ్ళారు. అప్పుడు ముత్యాలు వాళ్ళతో, ''నా డబ్బు పెట్టుబడిగా నేను చేసిన వ్యాపారం నాకు లక్షరూపాయలు సంపాదించి పెట్టింది. అదే డబ్బును అవసరంలో ఉన్న వాడికిస్తే అది పదేళ్ళలో పదిహేను లక్షలయింది. అంటే మన మంచితనం, అదృష్టం ఇతరులకు సాయపడినప్పుడే అధిక లాభాలు తెస్తాయి. ఆ నిజం మనం తెలుసుకోవాలనే మన ఊళ్ళో సత్యదేవుడు వెలిశాడు,'' అన్నాడు.

ఆ ఊరి వాళ్ళు చాలా మంది ముత్యాలు మాటలను నమ్మి, సత్యదేవుడి వరాలను సక్రమంగా ఉపయోగించుకుంటూ సుఖశాంతులతో జీవించారు. వజ్రాలు కూడా మంచి ఆలోచనలతో క్రమంగా అసూయను జయించి ప్రశాంతంగా కాలం గడుపసాగాడు.



## చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలు - 15

# తాంతియా తోపే తప్పించుకున్న మర్మం!

**1858** నవంబర్ నెలలో కాన్పూరు ప్రజలకు కలవరపెట్టే ఒక వార్త అందింది. ప్రథమ స్వాతంత్ర్య సమరం ఉధృతంగా జరుగుతున్న కాలఘట్టం అది. కోట కేసి బ్రిటిష్ సేనలు పెద్ద సంఖ్యలో కదిలి వస్తున్నాయి. అవి నగరాన్ని దోచుకోవడానికి వస్తున్నాయా? అయితే, పురోగమిస్తున్న సైనికులు వెలవెలబోతూండడం వింతగా కనిపించింది!

హఠాత్తుగా ఫిరంగుల ధ్వనులు, అరుపులు వినిపించసాగాయి. దారికి ఇరువైపుల అడవి ప్రాంతాలలో, పొలాలలో పొదల మాటున దాగి ఉన్న భారతీయ తిరుగుబాటుదారులు ఆగి, ఆగి బ్రిటిష్ సేనల మీద మెరుపు దాడులు చేయసాగారు. తుపాకులు పేలుస్తూ, గురి చూసి బాణాలు వదులుతూ, చీకటిలో భయంకరంగా అరుస్తూ బ్రిటిష్ సేనలను భయభ్రాంతుల్ని చేయసాగారు.

ఆఖరికి సైన్యం కాన్పూరు పరిసరాలకు తరుమగొట్ట బడింది. సైనికులు గుమిగూడి దాడికి సిద్ధమయ్యేలోగా ఉత్తేజభరితులైన తిరుగుబాటుదారులు వాళ్ళను చుట్టుముట్టి వెనక్కు తరిమారు. తుపాకుల పేలుళ్ళు, ఫిరంగుల మోతలతో భీకర యుద్ధం ఆరంభమయింది. ఆ రోజంతా యుద్ధం జరిగింది.

ఆఖరికి యుద్ధం ముగిశాక బ్రిటిష్ అధికారి తన మిత్రుడికి ఇలా రాశాడు: ''ఈ రోజు యుద్ధం



గురించి చదువుతూంటే నీకు ఆశ్చర్యం కలగవచ్చు. సుశిక్షితులూ ధైర్యసాహసాలకు పేరొందిన వారూ, బలమైన ఆయుధాలు కలిగిన వారూ అయిన బ్రిటిష్ సైనికులు సాధారణ భారత వీరుల ఎదురుదాడికి కట్టుకోలేక తమ శిబిరాన్నీ, ఆయుధాలనూ కోల్పోవలసివచ్చింది!'' (చార్ల్స్ బాల్: ఇండియన్ మ్యూటినీ)

బ్రిటిష్ సేనలకు జనరల్ వైన్దామ్ నాయకత్వం వహించి నడిపించాడు. అయినప్పటికీ, అంతటి అనుభవజ్ఞుడైన సేనానాయకుడూ, సాహసవంతులైన సైనికులూ స్థానికులకు సాటి కాలేకపోయారు. తిరుగుబాటుకు పూను

కున్న మామూలు ప్రజలలో ఇంతటి స్ఫూర్తిని కలిగించిన వారెవరో తెలుసా? ఆయనే తాంతియా తోపే! ఇంతకూ ఆయన శిక్షణ పొందిన సైనికుడు కాడు. క్షత్రియ కుటుంబానికి చెందినవాడు కూడా కాదు. అతి సాధారణ కుటుంబంలో 1814లో పుట్టిన తాంతియా తోపే నానా సాహెబ్ సంస్థానంలో గుమాస్తాగా ఉండేవాడు. మాతృ దేశాభిమానం, నిజమైన స్వామిభక్తి కారణంగా ఆయనలో అచంచలమైన పట్టుదల పుట్టుకువచ్చింది. తనను తాను దీక్షా దక్షతలు గల అద్భుతమైన సేనానాయకుడిగా మలుచుకోగలిగాడు.

ఘోరమైన ఈ పరాజయం తరవాత, లక్నో తిరుగుబాటుదారులను అణచే ప్రయత్నంలో ఇండియా బ్రిటిష్ సైన్యం అప్పటి సర్వసేనాధిపతిగావున్న సర్ కోలిన్ కాంబెల్ కాన్పూరు రక్షణకు హుటాహుటిగా పరిగెత్తుకు వచ్చాడు.



బ్రిటిష్ వారిని భయభ్రాంతుల్ని చేస్తూన్న తాంతియా తోపేను ఎలాగైనా పట్టుకోవాలన్న దృఢ నిర్ణయంతో వచ్చాడు.

అతడు అంత త్వరలో రాగలడని తాంతియా తోపే ఊహించలేకపోయాడు. రాజభవనం తగుల బెట్టబడింది. నగరం దోపిడీకి గురైయింది. అయినప్పటికీ తాంతియా తోపేను పట్టుకోలేకపోయాడు. తన ప్రాణాలకు తెగించి అతణ్ణి పట్టుకోవడానికి ప్రయత్నించాడు గాని, కృతకృత్యుడు కాలేకపోయాడు.

తాంతియా తోపే కల్పీకి తిరిగి వెళ్ళి కొత్త సైన్యాన్ని సమీకరించుకుని బ్రిటిష్ సేనలను ఎదుర్కొన్నాడు.

ఈ సంఘటన గురించి 1859 జనవరి 17వ తేదీ ఒక ఆంగ్ల రచయిత 'ది టైమ్స్'లో ఇలా రాశాడు: మరీ ఇబ్బంది పెడుతున్నాడు... గత జూన్ నెల నుంచి మధ్య భారతదేశాన్ని గడగడలాడిస్తున్నాడు. శిబిరాలను నాశపరిచాడు. నిధులను దోచుకున్నాడు. ఆయుధాలు ఎత్తుకు పోతున్నాడు... సేనలను సమీకరిస్తున్నాడు. యుద్ధాలు చేస్తున్నాడు... కొండల మీద... కోనలలో, నదీ నదాలలో, మైదానాలలో ముందుకూ, వెనక్కూ, పక్కలకూ ఇటూ అటూ తిరుగుతూ రకరకాలుగా యుద్ధాలు చేస్తున్నాడు...

తాంతియా తోపే ప్రాణాలతో ఉన్నంతవరకు తమకు శాంతి లేదని భావించిన బ్రిటిష్ అధికారులు ఎలాగైనా అతణ్ణి తుదముట్టించడానికి పూనుకున్నారు.

ఒకసారి తాంతియా తోపే తన రహస్య స్థావరంలో సహచరులతో కలిసి పథకాలు రూపొం

దిస్తూ చర్చలు జరుపుతున్నాడు. ఉన్నట్టుండి ఎవరో వీపుపై తాకడం గమనించి వెనక్కు తిరిగి చూశాడు. ఇంగ్లీష్ మేజర్ నవ్వుతూ కనిపించాడు. అతడి స్థావరాన్ని బ్రిటిష్ సైనికులు రహస్యంగా చుట్టుముట్టారు!

''తాంతియా తోపే పట్టుబడ్డాడు! దొరికిపోయాడు!'' అన్న అరుపులతో దిక్కులు పిక్కటిల్లాయి. అంతలోనే అన్నీ అణగారిపోయాయి. ''తాంతియా తోపే ఎక్కడ? ఇప్పుడే కదా ఇక్కడున్నాడు? ఇంతలో ఏమయ్యాడు? పట్టుకోండి... పట్టుకోండి!'' అన్న కేకలు వినిపించాయి. తాంతియా తోపే జాడ కనిపించలేదు!

కొంత సేపు యుద్ధం జరిగింది. చీకట్లో తిరుగుబాటుదారులందరూ ఎటో వెళ్ళిపోయారు. ఆ ప్రాంతాన్ని పకట్బందీగా వలయాకారంలో చుట్టుముట్టిన బ్రిటిష్ సేనలకు ఒక్క తిరుగుబాటుదారు కూడా పట్టుబడలేదు. భూమిలోపల సొరంగం ఏదైనా నిర్మించుకున్నారా? అని ఆశ్చర్యపోయారు.

అనుచరులు కొందరితో సహా తాంతియా తోపే పారోన్ అడవులకు చేరుకున్నాడని చెబుతారు. అక్కడ పాతమిత్రుడు నార్వార్ రాజా మాన్‌సింగ్‌ను కలుసుకున్నాడు. అయితే, బ్రిటిష్ వాళ్ళు ఆయన జాడ పసిగట్టారు. మాన్‌సింగ్‌కు లేని పోని ఆశలు చూపి మంచిచేసుకుని తాంతియా తోపేను పట్టివ్వమన్నారు.

మూడు రోజుల తరవాత అర్ధరాత్రి సమయంలో తాంతియా తోపే మిత్రులతో కలిసి రహస్యస్థావరంలో నిద్రిస్తూండగా మాన్‌సింగ్ అక్కడికి కొందరు బ్రిటిష్ సైనికులను తీసుకు వచ్చాడు. అక్కడి వారిని పట్టి బ్రిటిష్ వారికి అప్పగించాడు. ఇద్దరు వారిలో ఎదురు తిరిగి పోరాడి చీకటిలో గుర్రాలపై తప్పించుకుని పారిపోయారు.

తెల్లవారేసరికి బ్రిటిష్ శిబిరంలో ఆనందోత్సాహాలు మిన్నుముట్టాయి! అజేయుడనుకున్న తాంతియా తోపే ఇప్పుడు తమ గుప్పిట్లో! పేరుకు విచారణ జరిపి 1859 ఏప్రిల్ 18వ తేదీ సిప్రీలో ఉరితీశారు.

అయితే, తాంతియా తోపే నిజంగానే పట్టుబడి ఉరితీయబడ్డాడా? చీకటిలో తప్పించుకుపోయిన ఇద్దరు సైనికులలో ఒకరు తాంతియా తోపే; మరొకరు అతడి విశ్వసనీయుడైన మిత్రుడు పండిట్ గోవిందరావు. నిజానికి తప్పించుకునే పథకం రూపొందించింది ఆ మిత్రుడే! తాంతియా తోపే పేరుతో ధైర్యంగా ఉరికంబం ఎక్కిన యోధుడు నారాయణరావు భగ్వత్. తమ నాయకుడు సమరాన్ని కొనసాగించాలన్న ఆశయంతో అతడు తన ప్రాణాలను త్యాగం చేశాడు!

ఈ విషయం గురించి ఒక ఆంగ్ల రచయిత ఇలా రాశాడు: ''అర డజను తాంతియా తోపేలు ఉండి ఉన్నట్టయితే 1857 విప్లవ యుద్ధ చరిత్ర మరో విధంగా ఉండేది.''



# ఆదర్శపాలకుడు!

రాజు విక్రమ్‌సింగ్ పాలించే హిమగిరి రాజ్యానికి లోబడి పలు జాగీరుదారులు ఉండేవారు. అలాంటి వారిలో ధౌళగిరిని పాలించే కున్వర్ ధవాల్ సింగ్ చాలా ముఖ్యమైనవాడు. ప్రజల సంక్షేమం పట్ల చాలా శ్రద్ధ కనబరచే ధర్మపాలకుడిగా ఆయన పేరు గాంచాడు. ఆయన తన హవేలి (భవనం) లోపల ఒక పర్ణ కుటీరాన్ని నిర్మించుకుని తరచూ అక్కడ ధ్యానంలో గడిపేవాడు. ప్రజలకు ఎలాంటి మంచి పనులు చేయవచ్చా అని ప్రశాంతంగా ఆలోచించేవాడు.

తన జాగీరులో ఏదైనా నేరం గాని, దుశ్చర్య గాని జరిగిందంటే నేరస్థుణ్ణి శిక్షించడం కన్నా వాడా నేరానికి పాల్పడడానికి గల మూలకారణాలను తెలుసుకుని వాటిని సరిదిద్దడానికి ప్రయత్నించేవాడు. నేరాలు జరగడానికి తన పరిపాలనాలోపమే ప్రధాన కారణమని భావించేవాడు. అలాంటి నేరాలు మళ్ళీ జరక్కుండా కట్టు దిట్టంగా పాలనా విధానాలను రూపొందించేవాడు.

ఒకనాటి రాత్రి ఆయన ధ్యానం ముగించి కుటీరం ఎదుట కూర్చుని ఉండగా, ప్రధాన భవనంలో ఏదో అలికిడి వినిపించింది. ఎవరో భవనంలో ప్రవేశించినట్టు గ్రహించాడు. కాని కూర్చున్న చోటు నుంచి ఆయన లేవ లేదు. ఆయన ఊహించినట్టే ఒక దొంగ చప్పుడు కాకుండా భవనంలో జొరబడ్డాడు. అందరూ గాఢ నిద్రలో కనిపించారు. గదులన్నీ గాలించాడుగాని ఒక్క విలువైన వస్తువు కూడా వాడి కంటబడలేదు. ఆఖరికి అందంగా అలంక



రించబడ్డ ఒక చెప్పుల జత కనిపించడంతో వాటి నెత్తుకొని లోపలికి వచ్చినట్టే చప్పుడు కాకుండా వెళ్ళిపోయాడు.

తెల్లవారాక తన చెప్పుల జత ఒకటి కనిపించక పోవడం గమనించిన ధవాల్‌సింగ్ ఆ విషయం గురించి ఎవరికీ చెప్పలేదు. అప్పటికి ఆ సంఘటన గురించి మరిచిపోయాడు కూడా.

ప్రజల బాగోగులను ప్రత్యక్షంగా తెలుసుకోవడానికి తరచూ మారువేషంలో తిరగడం ధవాల్‌సింగ్‌కు అలవాటు. ముఖ్యంగా దుకాణాలుండే ప్రాంతాలలో తిరుగుతూ వర్తకుల వ్యాపార పద్ధతులనూ, ప్రజల స్థితి గతులనూ, పన్నులు వసూలు చేయడంలో తమ అధికారులు అనుసరించే పద్ధతులనూ రహస్యంగా ఆయన గమనించేవాడు.

అలా ఆ రోజు ఆయన మారువేషంలో సంత వీధిలో వెళుతూండగా, ఇద్దరు వ్యక్తులు గట్టిగా వాదులాడుకోవడం గమనించాడు. ఒక వ్యక్తి చేతిలో అందమైన చెప్పుల జత కనిపించింది. ధవాల్‌సింగ్ వాళ్ళను సమీపించి, ''ఏమిటి సంగతి? ఎందుకలా వాదులాడుకుంటున్నారు?'' అని అడిగాడు.

ఆ ఇద్దరిలో ఒకడు, ''ఇతడు ఈ చెప్పుల జతను అమ్ముతానంటున్నాడు. నాకు వాటిని కొనుక్కోవాలని ఉన్నది. అయితే, అది దొంగ సొమ్ము కాదని నేను రూఢిగా తెలుసుకోవాలి కదా? అందువల్ల ఆ చెప్పులు అతనివే అని చెప్పడానికి ఎవరినైనా సాక్ష్యం తీసుకు రమ్మంటున్నాను. అతడు తేలేనంటున్నాడు,'' అన్నాడు.

ధవాల్‌సింగ్ ఆ చెప్పుల జతను పరిశీలనగా చూశాడు. అవి హవేలీలో కనిపించకుండా పోయిన తన చెప్పులే అని వెంటనే గుర్తించాడు. కొంతసేపు మౌనంగా ఆలోచించాడు. ఆ దొంగ ఎంతటి డబ్బు అవసరంలో ఉన్నాడో కదా అని యోచించి తల పంకించి, వాటిని బేరమాడుతూన్న వ్యక్తితో, ''అయ్యా, ఆ చెప్పులు అతనివే. నా మాట మీద నమ్మకం ఉంచి నువ్వు వాటిని నిరభ్యంతరంగా కొనుక్కోవచ్చు. ఒక వేళ నువ్వు కొనకపోతే, నేనే వాటిని కొనుక్కుంటాను,'' అన్నాడు.

ఆ మాటతో అతడా చెప్పులను కొనుక్కున్నాడు.

కొన్ని రోజులు గడిచాక దొంగకు ఆ చెప్పులు తనవే అని చెప్పిన పెద్దమనిషి ధవాల్‌సింగ్ అన్న విషయం తెలిసిరావడంతో దిగ్భ్రాంతి చెందాడు. సిగ్గుతో కుంచించుకు పోయాడు. రాజభవనానికి పరిగెత్తిపోయి ధవాల్‌సింగ్ కాళ్ళపైబడి, ''క్షమించండి ప్రభూ! తమ వద్దే నేరానికి పాల్పడ్డ నన్ను శిక్షించకుండా వదిలేశారు. ఈ జన్మలో ఇక దొంగతనాల జోలికి పోను,'' అన్నాడు కన్నీరు కారుస్తూ.

ధవాల్‌సింగ్ వాణ్ణి లేవనెత్తి, ''నువ్వు తప్పును గ్రహించినందుకు చాలా సంతోషం. అయినా ఎవరైనా నేరానికి పాల్పడ్డారంటే అది నా పరిపాలనాలోపాన్నే సూచిస్తుంది. దొంగతనం చేసేలా నిన్ను పురికొల్పినవి పరిస్థితులు; వాటిని చక్కదిద్దలేని నా పాలనా విధానం! ఇకపై నా పాలనలో ఎవరికీ ఎలాంటి కొరతా రాకుండా జాగ్రత్త పడతాను,'' అంటూ ఓదార్చాడు.

ఇకపై ఎవరికీ ఎలాంటి హానీ తలపెట్టకూడదన్న దృఢనిర్ణయం నిండిన ఆ మనిషి కళ్ళల్లోని కొత్తవెలుగును చూసి ధవాల్‌సింగ్ చాలా సంతోషించాడు. –షంషేర్ అహ్మద్ ఖాన్




# చెస్ ఛాంపియన్లు

మనదేశానికి చెందిన విశ్వనాథన్ ఆనంద్ మూడవసారి వరల్డ్ ఛాంపియన్ టైటిల్‌ను కైవసం చేసుకున్నాడు. ఇప్పుడతడు క్లాసికల్, ర్యాపిడ్, బ్లిట్జ్ అనే చెస్ మూడు ఫార్మట్స్‌లోనూ వరల్డ్ ఛాంపియన్. 2000వసం.లో ఆనంద్ నాక్-అవుట్ ఫార్మట్‌లో టైటిల్ గెలుపొందాడు. 2007లో ఎనిమిది మంది ఆడే డబుల్ రోబిన్-రౌండ్ ఫార్మట్‌లో ఛాంపియన్‌గా వచ్చాడు. జర్మనీ దేశం బాన్‌లో అక్టోబర్ 29వ తేదీ మ్యాచ్-ప్లే ఫార్మట్‌లో రష్యాకు చెందిన వరల్డ్ ఛాంపియన్ వ్లాడిమిర్ క్రామ్నిక్‌ను ఓడించి వరల్డ్ ఛాంపియన్ అయ్యాడు. 2000లో మరో వరల్డ్ ఛాంపియన్ గ్యారీ కాస్పరోవ్‌ను ఓడించినప్పటి నుంచి రష్యా ఆటగాడు వ్లాడిమిర్ క్రామ్నిక్ అజేయుడుగా ఉంటున్నాడు. 2004లోనూ 2006లోనూ అతడు విజయాన్ని పునరావృతం చేశాడు. మ్యాచ్-ప్లే ఫార్మట్‌లో విశ్వనాథన్ ఆనంద్ తన శక్తిని నిరూపించలేదనే విమర్శకులకు బాన్ విజయం దీటైన సమాధానం ఇచ్చింది. 6.5కు 4.5 పాయింట్ల తేడాతో క్రామ్నిక్ మీద విజయం సాధించాడు. ఇది చారిత్రాత్మకమైన విజయం.




విశ్వనాథన్ ఆనంద్ విజయం సాధించిన అదే రోజున మన దేశానికి చెందిన పద్మినీ రావుట్ జార్జియాకు చెందిన నాటియా జలబడ్జేను 11కు 10 పాయింట్లతో గెలుపొంది 14-ఏళ్ళలోపు బాలికల వరల్డ్ టైటిల్‌ను కైవసం చేసుకున్నది. వియత్నాం వింగ్ తయూలో పద్మిని మాల్డోవాకు చెందిన డయానాతో బసియూతో ఒకే ఒక డ్రా అయింది. పద్మిని లోగడే పలు వయోపరిమితుల అంతర్జాతీయ విజయాలను సాధించింది.



# ఋషి శాపం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, బోధిసత్త్వుడు ఒక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. అతడి తండ్రి మణిమాణిక్యాల్లాంటి విలువైన వస్తువులతో వ్యాపారం చేస్తూండేవాడు. ఆయన బోధి సత్త్వుడికి పదహారేళ్ళ వయసు వరకూ, ఒక గురుకులంలో చక్కగా విద్య నేర్పించాడు.

బోధిసత్త్వుడు గురుకులం నుంచి ఇంటికి తిరిగి రాగానే అతడి తండ్రి, "నాయనా, నేను పెద్దవాణ్ణి అయిపోతున్నాను. నువ్వు నాకు ఒక్కగా నొక్క సంతానం. నీకు ఇంతకాలంగా నేను చేస్తున్న వ్యాపారంలోని మెళకువలు నేర్పదలిచాను," అన్నాడు.

బోధిసత్త్వుడు అందుకు సరేనన్నాడు. ఆ తరవాత ఒక వారం రోజులకు తండ్రీ కొడుకులు విలువైన మణిమాణిక్యాలను మూటలు కట్టుకుని, వ్యాపారనిమిత్తం బయలుదేరారు.

ఇద్దరూ అనేక గ్రామాలూ, పట్టణాలూ తిరిగి లాభసాటిగా తమవద్ద వున్న మణిమాణిక్యాలను అమ్ముతూ, చివరకు వారాణసి నగరం చేరారు. వాళ్ళు ఆ నగరం చేరేసరికి సూర్యాస్తమయమై చీకటి అలము కుంటున్నది. బోధిసత్త్వుడి తండ్రి నగరద్వారపాలకుణ్ణి సమీపించి, నగరంలో ప్రవేశించేందుకు అనుమతి కోరాడు.

"అయ్యలారా, సూర్యాస్తమయం నుంచి, తిరిగి సూర్యోదయం వరకూ నగర ద్వారాలు తెరవరాదని, రాజుగారి ఆజ్ఞ!" అన్నాడు ద్వారపాలకుడు.

బోధిసత్త్వుడి తండ్రి అతడితో, "నాయనా, మన రాత్రిభోజనం మాటేమిటి? ఇప్పుడే ఆకలి దహించేస్తోంది. నగరం ప్రవేశిస్తే ఏ సత్రంలోనో భోజనం చేసి, హాయిగా విశ్రమించే వాళ్ళం," అన్నాడు.

జాతక కథ



పక్కనే వుండి ఈ మాటలు విన్న ద్వారపాలకుడికి వాళ్ళపై జాలికలిగి, ''మీ వెంట వంట చేసుకునేందుకు అవసరం అయిన సామగ్రి వుంటే, నా చిన్న కుటీరంలో వంట చేసుకోవచ్చు,'' అన్నాడు.

తండ్రీకొడుకులు ద్వారపాలకుడు చెప్పిన చిన్న కుటీరంలోకి వెళ్ళి, ఒక గంట కాలంలో వంట పూర్తి చేసి, భోజనాలు ముగించారు. అయితే, అతి చిన్నదైన ఆ కుటీరంలో వాళ్ళిద్దరూ పడుకుని నిద్రపోయేందుకు చోటు చాలలేదు. బోధిసత్వుడి తండ్రి, ద్వారపాలకుడికి కృతజ్ఞతచెప్పుకుని, ''అయ్యా, ఈ రాత్రి విశ్రమించేందుకు తగిన చోటు ఏదైనా చూపగలరా?'' అని అడిగాడు.

''నగరం వెలుపల ఒక పర్ణశాలవున్నది. కాని, అది భూతప్రేతాలకు ఆవాసం. భయం లేదనుకుంటే, మీరక్కడ ఈ రాత్రి గడపవచ్చు,'' అన్నాడు ద్వారపాలకుడు.

భూతప్రేతాల మాట వింటూనే బోధిసత్వుడి తండ్రి దిగాలు పడిపోయాడు. కాని, బోధిసత్వుడు ఆయనకు ధైర్యం చెబుతూ, ''నాన్నా, మీరేం సంశయించకండి! పది సంవత్సరాల కాలం గురుకులంలో అభ్యసించిన నా విద్యల ప్రభావం మీరెరుగరు!'' అన్నాడు.

బోధిసత్వుడు ఇలా అనగానే, ఆయన తండ్రికి ఎంతో ధైర్యం కలిగింది. తండ్రీకొడుకులు ఇద్దరూ నగర పొలిమేరలో వున్న పర్ణశాలను చేరారు. అప్పుడు అక్కడ ఎవరూ లేరు. ఇద్దరూ లోపలికి పోయి, గోడవారగా వున్న బల్లచెక్కల పైన పడుకున్నారు.

ఆ పర్ణశాలలో నరమాంస భక్షకుడైన ఒకానొక యక్షుడు ద్వారబంధం మీద నివసిస్తున్నాడు. వాడీ మధ్య కొన్ని రోజులుగా ఆహారం దొరక్క ఆకలితో నకనకలాడుతున్నాడు. వాడు తండ్రీ కొడుకులను చూస్తూనే, మంచి ఆహారం దొరికిందని సంతోషించాడు. అయితే, వాడికొక ఋషి శాపం వున్నది. ఎవరైనా తుమ్మినప్పుడు. తుమ్మినవాడు గానీ, లేక పక్కన వున్నవాడు గానీ, చిరంజీవ అనకపోతే – ఆ అననివాడినే వాడు భక్షించగలడు!

ఈ కారణం వల్ల, యక్షుడు ఆ తండ్రీ కొడుకుల్లో ఎవరైనా తుమ్ముతారేమో అని చాలా సేపు వేచి చూశాడు. కాని, ఎంతకూ ఇద్దరిలో ఎవరూ తుమ్మకపోయేసరికి, వాడు పైనుంచి బోధిసత్వుడి తండ్రి మీద ఒక ఘాటైన భస్మం చల్లాడు.

ఆ భస్మం ముక్కుపుటాలను తాకగానే బోధిసత్త్వుడి తండ్రి గట్టిగా తుమ్మాడు. అయితే, బోధిసత్త్వుడు చిరంజీవ అనలేదు.

యక్షుడు సంతోషించి, ద్వార బంధం మీది నుంచి కిందికి దిగసాగాడు. ఇదంతా గమనించిన బోధిసత్త్వుడు, వెంటనే తండ్రి వీపుతట్టి, ''చిరంజీవ,'' అన్నాడు.

యక్షుడు నిరాశచెంది వెనుదిరుగుతున్నంతలో, వాణ్ణి ఆటపట్టించేందుకు, బోధిసత్త్వుడు తన ముక్కు రంధ్రాల్లోకి చిన్న గుడ్డపేలికను పోనిచ్చి పెద్దగా తుమ్మాడు.

యక్షుడికి తిరిగి ఆశ కలిగింది. తిరిగి వాళ్ళను సమీపించబోతూండగా, బోధిసత్త్వుడి తండ్రి, ''చిరంజీవ!'' అంటూ బోధిసత్త్వుడి తలను చేతితో తాకాడు.

ఇది చూసి యక్షుడికి కలిగిన కోపం అంతా ఇంతా కాదు. వాడికి నోటి దగ్గిరకు వచ్చిన ఆహారాన్ని ఎవరో హఠాత్తుగా తన్నుకు పోయినంత బాధ కలిగింది. అయినా, చేసేది లేక వాడు ద్వారబంధం ఎక్కబోతున్నంతలో బోధిసత్త్వుడు, ''యక్షా, ఇటు రా!'' అన్నాడు.

యక్షుడు వెనుదిరిగి బోధిసత్త్వుడి కేసి పరీక్షగా చూసి, ఆయన ముఖంలోని తేజస్సుకు భయకంపితుడై, చేతులు కట్టుకుని వచ్చి నిలబడ్డాడు.

బోధిసత్త్వుడు వాడికేసి తీవ్రంగా చూస్తూ, ''యక్షా! మీ జాతి నరభక్షకులని, నాకు తెలుసు. మా ఇద్దరిలో ఎవరో ఒకర్ని తిని, నీ ఆకలి తీర్చుకోవచ్చు గదా? అలా వెళ్ళి పోతున్నావేం?'' అని అడిగాడు.



యక్షుడు, బోధిసత్త్వుడికి వంగి నమస్కరించి, ''మహాతేజస్వీ! నా కొక ఋషి శాపం వున్నది. అందువల్ల, మీపట్ల నేను నిస్సారుణ్ణి!'' అన్నాడు.

''ఏమిటా ఋషి శాపం? ఎందుకా శాపం ఇచ్చాడు?'' అని అడిగాడు బోధిసత్త్వుడు.

అందుకు యక్షుడు, ''నేను ఇప్పటికి యాభైఏళ్లక్రితం అరణ్యాల్లో తిరుగుతూ, యధేచ్ఛగా కనబడిన మానవులను భక్షిస్తూ వుండేవాడిని. ఒకసారి చీకటిపడే వేళ ఒక నది ప్రాంతాన ఆహారం కోసం తిరుగుతున్నాను. ఆ సమయంలో చెట్లచాటు నుంచి ఒక మనిషి నది కేసి పోతున్నాడు. ఆహా, ఆకలి తీరేమార్గం కనిపించింది - అని సంతోషిస్తూ, వెనక నుంచి ఆ మనిషి మెడపట్టుకున్నాను. అంతే! మరుక్షణం పిడుగుపాటుకు గురైనవాడిలా

స్పృహ తప్పి కింద పడిపోయాను!'' అని ఇంకా ఏదో చెప్పబోయాడు.

బోధిసత్వుడు చిన్నగా నవ్వి, ''నీ పొగరు బోతుతనం కొద్దీ, తపశ్శాలి అయిన ఏ ఋషినో ఆహారం చేసుకోవాలనుకున్నావన్నమాట!'' అన్నాడు.

''అదే జరిగింది! కింద పడిన నేను కొద్ది సేపటికి తెప్పరిల్లి లేవ బోయేంతలో ఆ ఋషి, 'ఓరీ, పాపీ! ఈ ప్రాంతాల నరభక్షణ చేస్తున్నది నీవన్న మాట! నువ్వు చేసిన ఘోరాలకు ఫలితం అనుభవించక తప్పదు. నిన్ను ఆకలి బాధకు గురి చేయదలిచాను. మనిషికి తుమ్ము రావడం చాలా అరుదు. అలా ఎవరైనా తుమ్మినప్పుడు, ఆ తుమ్మినవాడు గాని లేక పక్కన వున్న వాడు గాని, చిరంజీవ అనకపోతే - అలాంటివాళ్ళను మాత్రమే భక్షించు! అంతే గాని, మరే మానవుడినైనా భక్షించదలిచావో నిలువునా దగ్ధమైపోతావు,' అని శపించాడు,'' అన్నాడు యక్షుడు.

ఇది విన్న బోధిసత్వుడికి, యక్షుడిపై జాలి కలిగింది. ఆయన వాడికి ప్రాణి హింస మహాపాపమని బోధించి, తెల్లవారిన తరవాత వాణ్ణి వెంటబెట్టుకుని తండ్రితో పాటు రాజును దర్శించాడు.

రాజు జరిగినదంతా విని, బోధిసత్వుడికి ప్రణమిల్లి, ''మీరు మహాశక్తి సంపన్నులు. మీ కారణంగా, నా రాజ్యంలోని ప్రజలకు, నరమాంసభక్షకుడైన యక్షుడి బాధతప్పింది. మీరు మా సేనాధిపతిగా పదవి స్వీకరించ కోరుతున్నాను,'' అని వేడుకున్నాడు.

బోధిసత్వుడు అందుకు అంగీకరించాడు. రాజు ఎంతగానో సంతోషించి బోధిసత్వుణ్ణి సేనాధిపతిగా నియమించాడు. ఆయన తండ్రిని ఘనంగా సన్మానించి, యక్షుడి సంగతేమని అడిగాడు.

''రాజా, ఈ యక్షుడిప్పుడు పరమసాత్వికుడు. అతడివల్ల ఇక ఎవరికీ ఎటువంటి కీడూ జరగదు. ఇతణ్ణి మీ అశ్వ, గజ శాలలకు అధిపతిగా నియమించండి,'' అని సలహా ఇచ్చాడు బోధిసత్వుడు.

రాజు ఆ విధంగానే యక్షుణ్ణి తన అశ్వ, గజ శాలలకు అధిపతిగా నియమించాడు.





# రామాయణం

లంక అంతా పరశురామ ప్రీతి చేసిన హనుమంతుడు అశోకవనంలో ఉన్న సీత వద్దకు తిరిగి వచ్చి, ఆమెకు నమస్కారం చేసి, ''నా అదృష్టం చేత నీ కేమీ అపాయం కలగలేదు. రాముడు త్వరలోనే వానరులనూ, భల్లూకాలనూ వెంటబెట్టుకుని వస్తాడు. నాకు సెలవిప్పించు,'' అన్నాడు.

అతను ఆమె వద్ద సెలవు పుచ్చుకుని అరిష్టమనే పర్వతం పైకి ఎక్కి సముద్రం పైకి చూసి తన శరీరాన్ని పెంచాడు. అతను ఒక్కసారి బలంగా తొక్కగానే ఆ పర్వతంలోని శిలలు పిండి అయ్యాయి; అందులో ఉండే మృగాలన్నీ భయపడి చెల్లాచెదరుగా పరిగెత్తాయి. హనుమంతుడు అవతలి ఒడ్డుకు ప్రయాణమైన వాడై ఆకాశంలోకి లేచాడు. అతను మేఘాల మధ్య సముద్రంలో వెళ్ళే ఓడలాగా గాలిలో తేలిపోతూ, సముద్రాన్ని లంఘించాడు. త్వరలోనే అతనికి దూరాన మహేంద్రపర్వతం కనబడింది. దాన్ని చూస్తూనే అతను ఉత్సాహంతో సింహనాదం చేశాడు.

హనుమంతుడెప్పుడు వస్తాడా అని ఆత్రంగా ఎదురు చూస్తున్న అంగదుడు మొదలుగాగల వానరులకు ఆ సింహనాదం విని పరమానందమయింది. అందరికీ పెద్ద వాడయిన జాంబవంతుడు వానరులందరినీ చేరదీసి, ''మన హనుమంతుడు పని చక్కచెట్టుకుని మరీ వస్తున్నాడు. అతని కంఠధ్వని వింటే అలాగే తోస్తున్నది,'' అన్నాడు.

వానరులు ఆనందంతో కుప్పిగంతులు వేశారు. కొందరు హనుమంతుణ్ణి చూడటా

సుందరకాండ – 7



నూరు యోజనాల సముద్రాన్ని అటూఇటూ కూడా దాటి నీకు సాటిలేడనిపించావు. మా అందరి మానాన్నీ కాపాడావు. అంతేకాదు, సీతాదేవిని కూడా చూశావు,'' అన్నారు. హను మంతుడు చెప్పబోయే విశేషాలు వినటానికి వానరులందరూ ఆత్రంగా ఉన్నారు.

జాంబవంతుడు హనుమంతుడితో, ''సీత నీ కెలా కనపడింది? ఆమె అక్కడ ఎలా ఉన్నది? ఆమె పట్ల రావణు డెలా ప్రవర్తిస్తు న్నాడు? ఉన్న సమాచార మంతా దాచకుండా చెప్పు. అందులో రాముడికి చెప్పవలసినదేదో, చెప్పగూడనిదేదో మనం తరవాత తేల్చు కుందాం,'' అన్నాడు.

హనుమంతుడీ విధంగా చెప్పసాగాడు: ''నేను బయలుదేరటం మీరు చూశారు గదా. కొంతదూరం వెళ్ళేసరికి ఒక అందమైన బంగారు పర్వత శిఖరం నా దారి కడ్డు తగి లింది. అది నన్ను ప్రేమగా పలకరించి, తాను మైనాకుణ్ణనీ, నా తండ్రి అయిన వాయుదేవుడు తనను ఇంద్రుడి నుంచి కాపాడాడనీ చెప్పింది. మైనాకుడి వద్ద సెలవు పుచ్చుకుని చాలా దూరం వెళ్ళాక సర్పమాత అయిన సురసాదేవి ఎదురై నన్ను మింగుతానన్నది. అంగుళం దేహంతో ఆమె నోట ప్రవేశించి వెంటనే బయ టికి వచ్చి దారి పుచ్చుకున్నాను.''

ఈ విధంగా ప్రారంభించి హనుమం తుడు, తాను చీకటిపడ్డాక లంకానగరం ప్రవేశించటమూ, లంకను జయించటమూ, లంక అంతా గాలించిన మీదట అశోక వనంలో ఒక శింశుపా వృక్షం కింద సీత కనిపిం

నికి చెట్లెక్కి, అతన్ని పిలుస్తున్నట్టుగా కొమ్మ లాడించారు. అంతలోనే హనుమంతుడు వచ్చి మహేంద్రపర్వతం మీద దిగాడు. వానరు లంతా అమితోత్సాహంతో అతన్ని చుట్టు ముట్టారు.

హనుమంతుడు జాంబవంతుడిలాటి పెద్ద లకూ, యువరాజైన అంగదుడికీ నమస్కారాలు చేసి, ''చూశాను సీతను,'' అని స్పష్టంగా చెప్పేశాడు. అతను అంగదుణ్ణి ఆలింగనం చేసుకుని, అందరూ కూర్చోవటానికి మహేంద్ర గిరి పైన ఒక సుందరస్థలం చూశాడు.

హనుమంతుడు సీతను చూశానన్న శుభ వార్త చెప్పగానే వానరులు కొందరు సింహ నాదాలు చేశారు. కొందరు కేకలు పెడితే మరి కొందరు జవాబులిచ్చారు, ఇంకొందరు రాళ్ళ మీదుగా దూకుతూ, ''హనుమంతుడా,

చటమూ మొదలైన విషయాలన్నీ వివరంగా చెప్పాడు. చివరికతడు ఇలా అన్నాడు:

''సీత మహా పతివ్రత అనటానికి సందేహం లేదు. ఆమె రాముడి కొరకే జీవిస్తూ చాలా కష్టాలకు గురి అవుతున్నది. నేనొక్కణ్ణే లంకను బూడిద చేసి వచ్చినప్పుడు, మన మందరమూ కలిసి రావణుడి బలాలన్నిటినీ హతమార్చ లేక పోతామా? మనలో జాంబవంతుడూ, అంగదుడూ, పనసుడూ, నీలుడూ, అజేయు లైన మైందద్వివిదులూ... ఇందరున్నారు. మనం రావణుణ్ణి చంపి సీతను రాముడి వద్దకు చేర్చటం బాగుంటుందేమో!''

అంగదుడు హనుమంతుడి మాటను బలపరుస్తూ, ''మనం సీతను చూసి కూడా ఆమెను తీసుకు పోకపోవటం అనుచితం. రాముడి వద్దకు వెళ్ళి, 'సీతను చూశాం, కాని తీసుకు రాలేదు,' అనటం ఏమీ బాగుం డదు. అసలు హనుంతుడు అక్కడి రాక్షస వీరులందరినీ చంపనే చంపాడు. సీతను తీసుకు రావటం తప్ప మనకు పెద్ద పని కూడా లేదు,'' అన్నాడు.

ఈ మాట విని జాంబవంతుడు, ''యువ రాజా, నీది చాలా మంచి ఆలోచనే. దీన్ని గురించి రాముడేమంటాడో తెలుసుకుని ఆయన చెయ్యమన్నట్టు చేద్దాం,'' అన్నాడు లౌక్యంగా. దీనికి అంగదుడే గాక మిగిలిన వానర వీరులు కూడా సమ్మతించారు.

తలపెట్టిన పని సానుకూలం కావటమూ, రాముడికి చెప్పవలసిన సమాచారం ఉండ టమూ, యుద్ధంచేసే అవకాశం ఉండటమూ



మొదలైన అంశాలతో వానరులు ఉద్రేకోత్సా హాలు చెంది తిరుగుముఖం పట్టారు. వారు గాలిలో ఎగురుతూ మధువనం చేరుకుని, అంగదుడి అనుమతితో అక్కడి చెట్ల మీద ఉన్న తుట్టెల నుంచి తేనె తాగారు, సంతోషం పట్టలేక రకరకాల ఆట లాడారు, కేకలు పెట్టారు, ఒకరి నొకరు తరుముకున్నారు, చెట్ల మీదుగా పరిగెత్తారు.

మధువనానికి రక్షకుడు దధిముఖుడు, సుగ్రీవుడి మేనమామ. వానరులు వనంలోని తేనె అంతా తాగెయ్యటమే గాక, చెట్లన్నీ ధ్వంసం చేసి, పూలన్నీ రాల్చెయ్యటం చూసి మండిపడి అతను వానరులను వనం విడిచి పొమ్మని కేక లేశాడు. కొందరిని కొట్టాడు. కొందరితో మంచి మాటలాడాడు. కొందరిని బతిమాలుకున్నాడు. కాని అందరూ అతన్ని



పట్టుకుని ఏడిపించుకు తిన్నారు కొంద రతన్ని రక్కి, కొరికారు కూడా.

హనుమంతుడు వానరులకు ప్రోత్సాహ మిస్తూ, ''మీ ఇష్టం వచ్చినట్టు తేనె తాగండి. ఎవరడ్డొస్తారో నేను చూస్తాను,'' అన్నాడు.

అంగదుడు హనుమంతుణ్ణి బలపరుస్తూ, ''హనుమంతుడు కూడని పని చెయ్యమన్నా నేను చేసేస్తాను. అలాటప్పుడు మంచి పని చెయ్యమంటుంటే మానట మెందుకూ!'' అన్నాడు. వానరులు అంగదుడి మాటలకు హర్షధ్వానాలు చేశారు. వారు తేనె తాగిన కైపులో చిత్తం వచ్చినట్టు చేశారు. మధువనం లోని కాపలా వాళ్ళందరినీ కట్టేశారు, పళ్ళన్నీ తినేశారు. కొందరు సింహనాదాలు చేశారు, కొందరు సన్నగా కూశారు, మరి కొందరు పడుకుని నిద్రపోయారు.

మధువన మంతా నాశనమవుతూండటం చూసి దధిముఖుడు తన కాపలా వాళ్ళ నందరినీ కూడగట్టుకుని, చెట్లూ, రాళ్ళూ మొదలైన ఆయుధాలతో అంగదాది వానర వీరులపై తలపడ్డాడు. హనుమంతుడు మొదలుగా గల వారు అతని మీద కలియ బడ్డారు. మత్తులో ఉన్న అంగదుడు, దధి ముఖుడు తన తాత అన్న స్ఫురణ కూడా లేకుండా, అతన్ని పడదోసి ఘోరంగా కుమ్మాడు. దధిముఖుడికి స్పృహ తప్పింది.

కొంత సేపటికి అతను తెలివి తెచ్చుకుని, తన చేతిలో ఉన్న చెట్టుతో తప్పతాగి ఉన్న వానరులను తరిమాడు. తరవాత అతను తన వారితో, ''వీళ్ళందరినీ ఇక్కడ పడి ఉండ నివ్వండి. నేను వెళ్ళి సుగ్రీవుడితో జరిగిన దంతా చెబుతాను. తరవాత సుగ్రీవుడే వాళ్ళ తలలు తీసేస్తాడు,'' అని చెప్పి శీఘ్ర గమనాన సుగ్రీవుడి వద్దకు వెళ్ళాడు.

సుగ్రీవుడు తన మేనమామను చూసి ఆశ్చర్యపడి, ''ఏమిటి విశేషం?'' అని అడిగాడు.

''మీ నాన్నగారి కాలంలో గాని నీ కాలంలో గాని దేవతలకైనా ప్రవేశింపరాని మధువనాన్ని అంగదుడు మొదలైన వానరులు ధ్వంసం చేసి పెట్టారు. కావలివాళ్ళు పొమ్మంటే కొట్టారు, తల కిందులుగా వేళ్ళాడ గట్టారు. మధువనం లోని తేనె అంతా తాగేస్తున్నారు,'' అని దధి ముఖుడు సుగ్రీవుడితో చెప్పాడు.

ఆ సమయంలో లక్ష్మణు డక్కడికి వచ్చి, దధిముఖుణ్ణి చూసి, ''ఇతనేమిటో ఫిర్యాదు చేస్తున్నాడు?'' అన్నాడు.

‘‘సీతను వెతకటానికి దక్షిణంగా వెళ్ళిన నా వాళ్ళు మధువనానికి వస్తూనే వనమంతా అల్లకల్లోలం చేసి తేనెలు తాగేస్తున్నారట. పని సానుకూలం చేసుకురాకపోతే వారట్లా ప్రవర్తించరు. వారు సీతను చూసే వచ్చారు. అందుకు సమర్థుడైన హనుమంతుడు వాళ్ళ వెంట ఉండనే ఉన్నాడు. పని ముగించుకు వచ్చిన పొగరులోనే వాళ్ళు కాపలా వాళ్ళను కూడా కొట్టారు,’’ అన్నాడు సుగ్రీవుడు.

సుగ్రీవుడు చేసిన ఊహ రామలక్ష్మణులకు పరమానందం కలిగించింది. సుగ్రీవుడు దధిముఖుడితో, ‘‘వానరులు మధువనంలోని తేనె తాగినందుకు చాలా సంతోషించానని చెప్పు. వాళ్ళ కోసం నేనూ, రామలక్ష్మణులూ వేచి ఉన్నాం. వారిని త్వరగా రమ్మను,’’ అన్నాడు.

దధిముఖుడు వారు ముగ్గురికీ ప్రణామం చేసి, శీఘ్ర గమనాన ఆకాశమార్గాన మధువనానికి తిరిగివచ్చే సరికి వానరులకు కైపు దిగిపోయింది. ఆతను అంగదుడితో, ‘‘యువరాజా, మేము నిన్నడ్డగించామని కోపించకు. తెలియక పొరపాటు జరిగి పోయింది. నేను వెళ్ళి మీరు వచ్చినట్టు మీ పినతండ్రికి చెప్పగా, ఆయన సంతోషించి మిమ్మల్నందరినీ త్వరగా రమ్మన్నాడు,’’ అన్నాడు.

అంగదుడు తన వారితో, ‘‘మనం ఇక్కడ విశ్రాంతి తీసుకున్నాం గనక, ఇక బయలుదేరుదాం. మనం వస్తున్న సంగతి రామలక్ష్మణులకు అప్పుడే తెలిసిపోయింది,’’ అన్నాడు.

అంగదుడూ, అతని వెనుకగా మిగిలిన వారూ ఆకాశంలోకి లేచారు. వారు కిష్కింధను



చేరవస్తూ చేసిన సింహనాదాలు సుగ్రీవుడికి వినిపించాయి. అతను ఆనందంతో తోక చాచి ఆడించాడు. ఇంతలో వానరులు హనుమంతుణ్ణీ, అంగదుణ్ణీ ముందుంచుకుని, రాముడున్న చోటికి వచ్చి వాలారు.

''వానరులారా, సీత ఎక్కడ ఉన్నది? నన్ను గురించి ఏ భావంతో ఉన్నది? అన్ని విషయాలూ నాకు వివరంగా చెప్పండి,'' అని రాముడు వానరుల నడిగాడు. వానరులు హనుమంతుణ్ణి ముందుకు తోశారు.

హనుమంతుడు రాముడికి జరిగినదంతా చెప్పి, సీత ఇచ్చిన చూడామణిని రాముడి చేతిలో పెట్టి, ''రామా, చిత్రకూటం మీద మీరుండేటప్పుడు కాకి ఉదంతం ఒకటి నీకు గుర్తుగా ఉండగలందులకు సీత చెప్పింది. తన కింకొక్క మాసమే గడువున్నదని నీతో చెప్పమన్నది. ఆమె చాలా అధైర్యం చెంది ఉన్నది. సముద్రం దాటి లంకకు వెళ్ళే ఉపాయం ఆలోచించండి,'' అన్నాడు.

సీత పంపిన చూడామణిని చూడగానే రామలక్ష్మణులకు దుఃఖం ఆగలేదు. రాముడు శోకవివశుడై, ''సీత కనిపించ కుండా ఈ చూడామణి కనిపించటం కన్న వేరే దుఃఖమేముంటుంది? సీత ఇంక ఒక్క నెలపాటే జీవించి ఉంటుందా? ఆమె ఉన్న చోటు తెలిసి అక్కడికి వెళ్ళకుండా, ఇక్కడ ఒక్క నిమిషమైనా ఎలా ఉండటం? ఆ భయంకర రాక్షస స్త్రీల మధ్య సీత ఇంత కాలం ఎలా ఉన్నది?'' అని ఆక్రోశించాడు.

అతను సీత అన్న మాటలన్నీ హనుమంతుడి చేత చెప్పించుకుని విన్నాడు. హనుమంతుడు అంతా చెప్పి, ''ఆమె నిన్ను సేనతో వచ్చి రావణుణ్ణి చంపి తనను కాపాడమన్నది. అందుకు తగిన ప్రోత్సాహం నన్నే ఇవ్వమన్నది. వానర సేనలు సముద్రం దాటి లంకకు రాలేవేమోనని ఆమె సంశయించింది. తనకు విమోచనం ఉండేదేమోనని భయపడుతున్న సీతను నేను అనేక రకాల ఓదార్చాను. నన్ను మించిన వారు సుగ్రీవుడి వద్ద వేలాది వానరులున్నారని చెప్పాను. రావణుడు మొదలైన వారు నాశనమైపోతారనీ, ఆమె తన భర్తతో అయోధ్యకు తిరిగి వెళుతుందనీ ధైర్యం చెప్పాను,'' అన్నాడు.

[సుందరకాండ సమాప్తం]





# నిధి అన్వేషణ

చంద్రయ్య జట్కాబండి తోలుకుని జీవించే వాడు. ఒక రోజు చీకటిపడి అతను ఇంటికి వెళ్ళిపోతూండగా, దారి పక్క నిలబడి ఉన్న ఒక మనిషి, ఊరికి ఆరు మైళ్ళ దూరంలో ఉన్న ఒక సత్రం వద్దకు బండి కట్టమని అడిగాడు. చంద్రయ్య మొదట రానన్నాడు గాని, తెల్లవారే లోపుగా తిరిగి రావచ్చునని చెప్పిన మీదట సరేనన్నాడు.

ఆ మనిషి తనతోపాటు వాసెనకట్టిన బిందెనూ, రెండు పలుగులనూ, పారలనూ బండిలో పెట్టుకున్నాడు. బండి బయలు దేరింది. ఆ మనిషి పాడుబడిన సత్రంలో ఏదో నిధి తవ్వబోతున్నట్టు చంద్రయ్య ఊహించాడు.

బండి సత్రం చేరేసరికి చాలా పొద్దు పోయింది. బండిలో ఎక్కిన మనిషి బిందె దించేటప్పుడు అది కిందపడి, పెద్ద చప్పుడయింది. అందులో నుంచి చిల్ల పెంకులు కొన్ని బయటికి వచ్చి ఉన్నాయి.

"ఈ రాత్రివేళ ఈ చిల్లపెంకుల బిందెను ఇక్కడికి ఎందుకు తెచ్చారు?" అని చంద్రయ్య ఆ పెద్దమనిషిని అడిగాడు.

"అంతా చెబుతాను. నాకు నీ సహాయం కావాలి," అంటూ ఆ పెద్దమనిషి ఇలా చెప్పాడు:

అతని పేరు వరహాలు. అతని తాత సముద్ర వర్తకం చేసి చాలా సంపాదించిన వాడు. ఆయన ఒకసారి బోలెడు డబ్బుతో తిరిగి వస్తూ, అర్ధరాత్రి అయ్యేసరికి ఈ సత్రంలోనే బస చేశాడు. ఆ రాత్రే ఆ సత్రం మీద బందిపోటు దొంగలు పడ్డారు. వాళ్ళు అడ్డం వచ్చిన వారినందరినీ చంపి, దొరికినదంతా దోచుకుని వెళ్ళిపోయారు. చచ్చిన వారిలో వరహాలు తాత కూడా ఉన్నాడు.

25-ఏళ్ళనాటి చందమామ కథ

వరహాలు తండ్రి మళ్ళీ చిల్లర వ్యాపారంతో ప్రారంభించి, ఎలాగో వరహాలును పెంచి పెద్దవాణ్ణి చేసి చనిపోయాడు. తండ్రి పోయేనాటికి వరహాలుకు ఇల్లు తప్ప ఏమి మిగల లేదు. ఆ ఇల్లు అమ్మేద్దామని, వరహాలు అటకమీదపాతసామానులు తీస్తుంటే, అతని తాత తాలూకు పుస్తకం ఒకటి కనబడింది. ఆ పుస్తకం కాగితాలు తిప్పుతూంటే ఒక చోట అతని తాత ఇలా రాసినట్టు కనబడింది: ''మార్గ మధ్యంలో ఈమధ్య బందిపోట్ల దొంగల అపాయం ఎక్కువవుతోంది. అపాయాన్ని శంకించి, సత్రంలో దిగగానే నా దగ్గిర ఉన్న డబ్బు అంతా పెట్టెతో సహా, కొత్తగా మొక్కల కోసం తవ్విన బోదెలో పూడ్చి పెడుతున్నాను. సత్రంలో నాకేదైనా జరగకూడనిది జరిగితే సత్రం వెనక ఉన్న చెట్ల కింద తవ్వితే, నేను దాచిన ధనం దొరుకుతుంది.''

ఈ మాట చెప్పి వరహాలు చంద్రయ్యతో, ''సత్రం వెనక ఉన్న చెట్ల కింద మా తాత దాచిన నిధి కోసం మనం తవ్వాలి. మన అదృష్టం బావుండి అది దొరికితే నువ్వు నాకు సహాయపడినందుకు నీకు నిధిలో మూడోవంతు ఇస్తాను,'' అన్నాడు.

చంద్రయ్య అందుకు సంతోషంగా ఒప్పుకుంటూ, ''అయితే ఈ చిల్లపెంకుల బిందె దేనికీ?'' అని అడిగాడు.

''ఉన్నట్టుండి మనం బిందె వెంట పెట్టుకువస్తే అందరికీ అనుమానం కలుగుతుంది. రోజూ ఇది మన వెంట ఉంటే ఎవరూ పట్టించుకోరు. పెట్టెలో డబ్బు ఇందులో పెట్టుకుపోవచ్చు. ఈలోగా ఒకవేళ ఎవరైనా అనుమానపడి బిందెను తణిఖీ చేస్తే ఇందులో చిల్లపెంకులు తప్ప ఏమీ ఉండవు!'' అన్నాడు వరహాలు.



చంద్రయ్య గుర్రాన్ని విప్పి ఒక చెట్టుకు కట్టేశాడు. తరవాత ఇద్దరూ చెరొక పలుగూ, పారా తీసుకుని సత్రం వెనకపక్కపోయి, చెట్ల పాదులన్నిటి వద్దా చెరొక వైపు నుంచీ తవ్వి చూడటానికి ఉపక్రమించారు.

తెల్లవారవస్తున్నదనగా వాళ్ళు విరమించి, మర్నాడు రాత్రి మళ్ళీ రావటానికి తీర్మానించుకున్నారు. ఆ రాత్రి వారి ప్రయాసకు ఫలితం లేకపోయింది. గోతులు మళ్ళీ పూడ్చి, పలుగులూ, పారలూ ఒకపొదలో దాచి ఇద్దరూ బండి ఎక్కారు.

చంద్రయ్య వరహాలును అతని ఇంటి వద్ద దించి తన ఇల్లు చేరుకున్నాడు.

''రాత్రంతా ఎక్కడ ఉన్నావు?'' అని చంద్రయ్యను అతని భార్య కామాక్షి అడిగింది.

చంద్రయ్య భార్యకు జరిగినదంతా చెప్పి, ''మళ్ళీ ఎక్కడా అనకు. నేను మళ్ళీ సాయంత్రం వెళ్ళి మరికొన్ని చెట్ల దగ్గిర తవ్వుతాను. నిధి మన అదృష్టం కొద్దీ నేను తవ్వే పక్క ఉంటే, దాన్ని మనమే ఉంచేసుకోవచ్చు. మన దరిద్రం తీరిపోతుంది,'' అన్నాడు.

''అన్యాయం! మనకు అన్యాయపు సొమ్ము వద్దు!'' అన్నది కామాక్షి.

కాని చంద్రయ్య భార్యమాట వినిపించుకోకుండా, సాయంత్రం వేళ, పాడుబడిన సత్రంచేరి, కొన్ని చెట్ల మొదళ్ళ దగ్గిర తవ్వి, ఏమీ దొరక్క, ఆ గోతులను మళ్ళీ పూడ్చి ఇంటికి చేరాడు.

ఆ రాత్రి మళ్ళీ వరహాలూ, చంద్రయ్యా సత్రం వెనక తవ్వారు. ఇలా రెండు వారాల



పాటు ఇద్దరూ శ్రమపడ్డారు. అయితే చంద్రయ్య నిద్రాహారాలు సరిగా లేక పగలూ, రాత్రీ కూడా శ్రమపడి, డీలా అయిపోయాడు. మర్నాడు ఉదయానికి అతనికి జ్వరం కూడా తగిలింది.

''ఈ రాత్రికి నేను బండి కట్టలేను,'' అని చంద్రయ్య పొరుగింటి పుల్లయ్య ద్వారా ఆ సాయంత్రం వరహాలుకు కబురు పంపాడు.

పుల్లయ్య తిరిగివచ్చి, వరహాలు ఇల్లు ఖాళీచేసి పట్నం వెళ్ళాడని చంద్రయ్యకు తెలిపాడు. చంద్రయ్య తల తిరిగిపోయింది. వరహాలు సకుటుంబంగా పట్నం వెళ్ళాడంటే అతనికి నిధి దొరికిందన్న మాట! కిందటి రాత్రి వాళ్ళు తిరిగి వచ్చినప్పుడు బిందెలో చిల్లపెంకులకు బదులు ధనం ఉన్నదన్న మాట! తనను వరహాలు ఎంత మోసం

చేశాడు! తాను వరహాలును మోసం చెయ్య జూసిన సంగతి ఆ క్షణంలో చంద్రయ్యకు గుర్తు రాలేదు. వరహాలు ఎక్కడికి వెళ్ళాడో తెలుసుకుంటానని కేకలు పెట్టుతూ అంత జ్వరంతోనూ చంద్రయ్య వరహాలు ఇంటికి పడుతూ, లేస్తూ బయలుదేరాడు.

వరహాలు ఇల్లు తాళం పెట్టి ఉన్నది. పక్క ఇంటి అరుగుమీద కూర్చుని ఉన్న ముసలి వాణ్ణిఅడిగితే, "పిచ్చి బాగా ముదిరిపోయింది. వైద్యానికిపట్నం తీసుకుపోయారు," అన్నాడు.

చంద్రయ్య నిర్ఘాంతపోయి, "వరహాలుకు పిచ్చా?" అని అడిగాడు.

"కాదామరి? తాత నిధి దాచాడని ఇల్లంతా తవ్వేశాడు! ఈ పిచ్చితో వ్యాపారం కూడా మానేశాడు! చివరకు ఒక బిందె దొరికిందిలే! అందులో చిల్ల పెంకులు తప్ప ఏమీలేవు! రాను రాను పిచ్చి మరీ ముదిరింది. అతని భార్య అతన్ని పట్నం తీసుకుపోయింది," అన్నాడు ముసలివాడు.

చంద్రయ్యకు అంతా అర్థమయింది. ఆ పిచ్చివాణ్ణి నమ్మి తాను కూడా గోతిలో పడ్డాడు! ఆ వరహాలు పిచ్చే తనకూ అంటింది! డబ్బు ఎంతటి వాణ్ణయినా పిచ్చివాణ్ణి చేస్తుంది! ఇప్పటికైనా నిజం తెలిసింది.

చంద్రయ్య, మనస్సు తేలికపడి, కాళ్ళీడ్చు కుంటూ ఇంటికి బయలుదేరాడు.

అంతదాకా స్తంభం చాటున ఉన్న కామాక్షి ఇవతలికి వచ్చి, "క్షమించు, తాతా! నీ చేత అబద్ధం చెప్పించాను," అన్నది.

"అవునూ, వరహాలుకు నిధి దొరికి, అప్పులు తీర్చి, పట్నం వెళ్ళిపోయాడు గదా? మరి అతనికి పిచ్చి అని ఎందుకు చెప్పమ న్నావు?" అని అడిగాడు తాత.

కామాక్షి తాతకు జరిగినదంతా చెప్పి, "అలా చెప్పకపోతే నా మొగుడికి నిజంగా పిచ్చి పట్టుకునేది! ఈ నిధి గొడవ వచ్చిన దాకా తాను సంపాదించే దానితో మేం సుఖం గానూ, శాంతంగానూ బతుకుతున్నాం. అటువంటివాడికి నిధి దాహం పుట్టితే మాకు సుఖం ఉంటుందా. కుటుంబంలో శాంతి ఉంటుందా?" అని చెప్పి, మరో దారిన వేగంగా ఇంటికి బయలుదేరింది.






# స్నేహితుడు

ఒక రోజు రామేశం, కామేశం నదీ తీరంలో నడుస్తున్నారు. వారికి ఒక మనిషి ఎదురై తన దగ్గిరున్న రెండు కృష్ణుడి బొమ్మలు చూపించి, ''తెచ్చిన బొమ్మలన్నీ అమ్ముడై ఈ రెండు మాత్రమే మిగిలాయి. ఒక్కొక్కటి పది వరహాలకు అమ్మాను. రెండూ తీసుకునే మాటైతే రెండింటినీ పదివరహాలకే ఇస్తాను,'' అన్నాడు.

రామేశం దగ్గర డబ్బు లేదు. కామేశం దగ్గర డబ్బు ఉందిగానీ, రెండింటినేం చేసుకుంటా నని తటపటాయిస్తూంటే, ''బొమ్మలు బావున్నాయి. ఒకటి నువ్వుంచుకుని రెండవదాన్ని నీ స్నేహితుడికెవరికైనా కానుకగా ఇవ్వవచ్చు,'' అని ప్రోత్సహించాడు రామేశం.

''అలా కాదు. నువ్వూ ఒకటి తీసుకోవాలి,'' అని రామేశాన్ని ఒప్పించాక, ఆ బొమ్మలు కొన్నాడు కామేశం. ఆ తరవాత ఇద్దరూ మాట్లాడుకుంటూ ఇళ్ళను సమీపించారు. అప్పుడు రామేశం, ''ఒక్కనిమిషం ఆగు కామేశం. లోపలికెళ్ళి డబ్బు తెచ్చిచ్చి తీసుకుంటాను,'' అన్నాడు.

కామేశం నవ్వి, ''భలేవాడివే. నీ దగ్గర డబ్బు తీసుకుంటానా? ముందీ బొమ్మ తీసుకో,'' అన్నాడు.

''ఊరికే ఎవర్నించీ ఏ వస్తువూ తీసుకోవడం నాకిష్టముండదు,'' అంటూ రామేశం వెళ్ళిపోయాడు.

కామేశం రెండు బొమ్మలూ తీసుకుని ఇంటికెళ్ళి భార్యకు చూపించి జరిగింది చెప్పాడు. కామేశం భార్య నొచ్చుకుని, ''అయ్యో! రామేశం అన్నయ్యకీ బొమ్మ నచ్చినట్టుంది. ఆయన పద్ధతి మనిషి. డబ్బు తీసుకుని ఆయనకిచ్చేయాల్సింది,'' అన్నది.

''నేనూ పద్ధతి మనిషినే. డబ్బు ఇవ్వనంటేనే బొమ్మ ఆయనకిస్తాను,'' అన్నాడు

బాబి



కామేశం పట్టుదలగా. ''అయితే, నాలుగు రోజులాగి బొమ్మను వదినకిస్తాను. డబ్బు తీసుకోను. అలా నీ పద్ధతి పాటించినట్టూ అవుతుంది. ఆయనకు బొమ్మ చేరినట్టూ అవుతుంది,'' అన్నది కామేశం భార్య.

ఆలాగే ఆమె నాలుగు రోజులాగి ఆ బొమ్మను రామేశం భార్యకిచ్చి వచ్చింది.

ఒకనాడు కామేశం ఏదో పని మీద గ్రామాధికారి ఇంటికి వెళ్ళాడు. అప్పుడు గ్రామాధికారి కంబళి బేరమాడుతూండడం చూశాడు. నేల మీద పరచిన కంబళి ఇంకా కొత్తగా ఉండడం గమనించి, ''ఇంట్లో ఉన్న కంబళి కొత్తగానే ఉంది కదా? ఇంకో కంబళి ఎందుకు?'' అని అడిగాడు.

''ఆ ప్రశ్న నన్ను కాదు. నీ మిత్రుడు రామేశాన్నడుగు. ఆయన ఈ కంబళి తీసుకుంటానన్నాకే నేను కొత్తది కొనాలనుకున్నాను,'' అన్నాడు గ్రామాధికారి.

కామేశం ఆశ్చర్యంగా, ''రామేశం వాడిన సరుకులు కొంటాడా?'' అని అడిగాడు.

''అయ్యో, ఎంత మాట! ఆయనకు వాడిన వాటిని అమ్మడమా? పాతబడిన వాటిని పారేయడం ఆయనకు ఇష్టం ఉండదు. తన ఇంట్లో దాస్తాడు. అంతే,'' అన్నాడు.

కామేశం తెల్లబోయి, ''రామేశం నీ దగ్గరేనా? ఇంకా ఎవరి దగ్గరైనా తీసుకుంటాడా?'' అని అడిగాడు.

''చాలా మంది దగ్గర తీసుకుంటాడు,'' అన్నాడు గ్రామాధికారి.

కామేశానికి వచ్చిన ఉక్రోషమింతా అంతా కాదు. ఊళ్ళో అందరి దగ్గరా పాతవస్తువులు ఉచితంగా తీసుకునే రామేశం–ఊరికే ఏమీ ఎవరి నుంచీ తీసుకోనని తన దగ్గిర దంబాలు పలికాడు. ఈ నిజాన్ని ఊరందరి ముందూ బయటపెట్టాలని అక్కడి నుంచి ఆవేశంగా బయలుదేరాడు. ఇంటికి వెళ్ళి భార్యను వెంటబెట్టుకుని రామేశం వద్దకు వెళ్ళి గ్రామాధికారి చెప్పిన విషయమై నిలదీశాడు.

రామేశం నవ్వి, ''ఈ మాత్రం దానికి ఇంత రభస దేనికి? ఇతరుల వద్ద తీసుకున్న వస్తువులను నా దగ్గర దాచుకోవడం లేదు. ఎవరిచ్చారో వాళ్ళ స్నేహితులకిస్తూంటాను,'' అన్నాడు.

''ఇవ్వాలనుకున్నది ఎవరి స్నేహితులకు వాళ్ళే ఇచ్చుకుంటారు. మధ్యలో నీ మధ్యవర్తిత్వందేనికి?'' అన్నాడు కామేశం నిరసనగా.

రామేశం గొంతు తగ్గించి, ''నీకో రహస్యం చెబుతాను, నువ్వా దాన్ని కాపాడాలి. లేకుంటే గ్రామాధికారి ఆగ్రహానికి గురౌతావు,'' అంటూ అసలు సంగతి చెప్పాడు.

గ్రామాధికారికి పొరుగూర్లో పేద మిత్రుడొకడున్నాడు. ఆయన గ్రామాధికారి ఇంటికి వచ్చినప్పుడు ఆ ఇంట్లో కంబళి చూసి, అలాంటిది తానెప్పటికి కొనగలనో అని వాపోయాడు. గ్రామాధికారికి ఊరికే ఇవ్వాలని ఉన్నది, కాని స్నేహితుడు చిన్నబుచ్చుకుంటాడని ఊరుకున్నారు. రామేశానికి విషయం తెలిసి సాయపడతానన్నాడు.

''నేను పాత వస్తువులు సేకరిస్తాననీ, కావలసినవారు వాటిని ఉచితంగా పొందవచ్చుననీ అవసరంలో ఉన్నవారికి తెలియజేస్తాను. వాళ్ళు దానిని పట్టుకుపోతారు. పేద మిత్రుల్ని చిన్నబుచ్చకుండా, మొహమాటస్థులకు ఇబ్బంది కలక్కుండా సాయ పడ్డానికే నేనిలా చేస్తున్నాను,'' అన్నాడు రామేశం.

''మరి ఆ రోజు నా దగ్గర బొమ్మ ఎందుకు తీసుకోనన్నావ్?'' అని అడిగాడు కామేశం.

''కొత్త వస్తువును కానుకగా మాత్రమే తీసుకుంటాను. ఆ రోజు నువ్వు డబ్బు వద్దన్నావుగాని, కానుకగా తీసుకోమనలేదు కదా?'' అన్నాడు రామేశం.

''నాలుగు రోజుల తరవాత నా భార్య ఇస్తే మీ ఆవిడ తీసుకున్నది. నీకు చెప్పలేదా?'' అని అడిగాడు కామేశం.

''నా భార్య నాకు చెప్పకుండా ఏ పనీ చెయ్యదు. ఆ బొమ్మ అప్పటికి పాతబడింది కనక తీసుకోమన్నాను. దాన్ని నీ స్నేహితుల కెవరికైనా ఇద్దామంటే-ఎక్కడా నీకు స్నేహితులన్నవారే దొరకలేదు. ఆ విషయం చెప్పి తిరిగిచ్చేద్దామా అనుకున్నాను. కానీ నువ్వు నొచ్చుకుంటావని ఊరుకున్నాను. పోనీలే, నేనైనా నీ స్నేహితుణ్ణే కదా అని సరిపెట్టుకుని ఆ బొమ్మను నా దగ్గరే ఉంచుకున్నాను. నేను కూడా నీ స్నేహితుణ్ణి కాదంటే చెప్పు. బొమ్మ వెనక్కు ఇచ్చేస్తాను,'' అన్నాడు రామేశం.

తను రామేశం చేతిలో మరోసారి భంగ పడ్డానని గ్రహించిన కామేశం చిన్నబోయిన ముఖంతో ఇంటిదారి పట్టాడు.





# BACK ISSUE BHANGRA!

LAST DATE 31ST DECEMBER 2008




## Unwind with Chandamama's Rewind!

Pick your favourite year from the new millennium [2001-2007] and place an order to read all 12 *Chandamama** issues that year!

*Offer valid for Chandamama English, regional languages, and Junior Chandamama for a minimum period of one year on a first come first served basis. Cost per year will be calculated on cover price + Rs.300/- [shipping and handling charges].

**Payment to be made by DD or at par cheque drawn in favour of Chandamama India Ltd. Payable at Chennai. Kindly send your request with name, full postal address, contact details and specification of the Language and Year.
Address: JVL Plaza, 6th Floor,
626, Anna Salai Phone: +91-44-24334455.

***If stock is not available, payment will be refunded.

# చందమామ క్విజ్ - 11

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మన దేశ చరిత్రకు సంబంధించిన కొన్ని విశేషాలను ఈ నెల క్విజ్‌లో చూద్దాం.

మీరు చేయవలసిందేమంటే : 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ క్విజ్ - 11 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. డిసెంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. ఫిబ్రవరి 2009 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.




1. క్రీ.శ. 370-410 మధ్య భారత దేశానికి వచ్చిన చీనా యాత్రికుడు ఎవరు?
2. భారత యూనియన్‌తో పాండిచ్చేరి ఎప్పుడు చేర్చబడిందో తెలుసా?
3. ఇందిరాగాంధి జీవితంలో 1966 జనవరి 24వ తేదీ ప్రాముఖ్యత ఏమిటి?
4. జహంగీరు చక్రవర్తిని కలుసుకున్న బ్రిటిష్ రాయబారి ఎవరు? ఎప్పుడు?
5. విజయలక్ష్మి పండిట్ ఎవరు? ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ అధ్యక్షులుగా ఆమె ఎప్పుడు ఎన్నుకోబడ్డారు? స్వాతంత్ర్యానికి ముందు, తరవాత ఆమె నిర్వహించిన పదవీ బాధ్యతలు ఏవి?
6. రజీయా సుల్తానా ఎవరు? ఆమె తండ్రి పేరేమిటి?

# వార్తలలో బాలలు

## పదమూడేళ్ళ మెజీషియన్



మ్యాజిక్‌షోలంటే పిల్లలకు ఇష్టమే కాని చిన్న కుర్రాడు మ్యాజిక్ చేసి చూపుతున్నాడంటే ఆశ్చర్యమే కదా. పదమూడేళ్ళ కరుణ్ కృష్ణ గాలిలోంచి చాక్లెట్లు తీసి పంచుతున్నాడు! బెంగళూరుకు చెందిన కరుణ్ 2005లో పోగోస్ 'అమేజింగ్ కిడ్'గా ఎంపికయ్యాడు.

కరుణ్ మూడేళ్ళ బిడ్డగా ఉన్నప్పుడే బొమ్మలతో, కార్లతో ఆడుకోవడం కన్నా కార్డు ముక్కలతో, నాణాలతో ఆడుకోవడానికే ఎక్కువ ఆసక్తి చూపేవాడు. దానిని గమనించిన అతడి తండ్రి- బెంగళూరుకు చెందిన సుప్రసిద్ధ మెజీషియన్ దగ్గర కృష్ణకు మ్యాజిక్ నేర్పించాడు. ప్రపంచం మొత్తం నుంచి 750 మందికి పైగా పాల్గొన్న 'ఇంటర్నేషనల్ మెజీషియన్స్ కన్వెన్షన్'లో అతడు 'విస్మయ 2008'లో ప్రథమ బహుమతి గెలుపొందాడు.

## అద్భుతమైన జ్ఞాపకశక్తి

అవ్యుత్ వయసు రెండున్నరేళ్ళే. ఆ వయసు పిల్లలు చాలా మంది టీవిలో 'టామ్ అండ్ జర్రీ'ని గుర్తుపట్టడంతో ఊరుకుంటారు. అయితే, అవ్యుత్ కంపెనీ లోగోలు, కంపెనీ పేర్ల స్పెల్లింగులూ చక్కగా చెప్పగలుగుతున్నాడు. బాలీవుడ్ బిగ్ బి నుంచి క్రికెట్ బిగ్ డి ధోనీ వరకు గల సెలిబ్రిటీల పేర్లను ఆ కుర్రాడు చెప్పగలుగుతున్నాడు. సినిమా పాటలు వినగానే వాటిలో నటించిన నటీనటుల పేర్లు చెబుతున్నాడు.

అవ్యుత్ తండ్రి కె. ఉమేష్ బాబు ఈ విషయం గురించి చెబుతూ ఇలా అన్నాడు: ''అతడిలో ప్రత్యేక ప్రతిభ ఉండడం గమనించిన నేను నటీనటుల బొమ్మలను, కంపెనీలోగోలను మెల్లమెల్లగా చూపడం ప్రారంభించాను. అతడు వాటిని త్వరగా గ్రహించసాగాడు. దాంతో అతడికి మరిన్ని నేర్పడానికి నాకు ఉత్సాహం కలిగింది. అయినా ఇవన్నీ ఏమాత్రం ఒత్తిడి లేకుండా అతడు స్వయంగా నేర్చుకోవడానికి ఆసక్తి కనబరచడం విశేషం.

దాదాపు 300 మెట్లకుపైగా గల మరుదమలై ఆలయం కొండను అవ్యుత్ సునాయాసంగా ఎక్కడం చెప్పుకోతగ్గ మరో ఆసక్తికరవిశేషం.



chandamama.com is now MORE

# Hot Happening Hecka Lot of Fun!



## Want to become a Chandamama Author? Come online!

## Tiger or Tigon?

Ranger Rani, our resident animal lover and zoologist rolled into one, brings you loads of interesting info on the animal world.

Hi kids! Here is the question:
When can a tiger look like a tiger without being a tiger?

Wait! Don't give up! Rani Ranger has the answer: when it's a tigon!

Can you guess what a tigon is? If you say a cross between a tiger and lion, you're right. A tigon is born to a lion mother and tiger father. They don't occur in nature; neither are they a new species of animal. They are artificial hybrid animals. Because of this, Tigons don't have scientific names like other animals.

Tigons are born in overcrowded zoos, amusement parks or circuses. They might have stripes, like a tiger's. Others have spots. But many have both spots and stripes!

For many years, tigons were a best-kept secret in circuses in India. In 1837, Queen Victoria came to India for an official visit. The princess of Jamnagar state presented a tigon cub to the Queen, which became her pet. A travelling circus with a litter of tigons also exhibited them to the Royal family. That was the first time western people saw tigons.

Want to know more about tigons and other animals?
Visit RANGER RANI'S ADVENTURES in our EXPLORE column!

### Chill Out

Movies, music, books... get the latest reviews here!







### Download

You like to read ebooks? Come to our Download section.

### Comics

Interviews and issues, with today's popular kids and adults





### What's more...

Hundreds of stories for your reading pleasure

Post your thoughts in our POST section

# ఫోటో వ్యాఖ్యల పోటీ


MAHANTESH C. MORABAD

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.


MAHANTESH C. MORABAD



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు ఫిబ్రవరి 2009 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, జెవిఎల్ ప్లాజా 6వ అంతస్తు, 626, అన్నాసాలై, తేనాంపేట, చెన్నయ్ - 600 018

## అభినందనలు

అక్టోంబర్ నెల
పోటీ ఫలితాలు
బోడపాటి కృష్ణవేణి
ఫ్లాట్ నెం. 7 'రామ్స్'
19, రాజా వీధి, త్యాగరాయనగర్,
చెన్నయ్ - 600 017
(ఆం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో: విందుభోజనం వినోదం!
రెండవ ఫోటో : ఆకలి తీరితే ఆనందం!!

## సమాధానాలు :

1. స్వర్ణ దేవాలయం 2. మధురై మీనాక్షి దేవాలయం 3. గోవా వెల్హాలోని బసీలికా ఆఫ్ బామ్ జీసస్; సెయింట్ జేవియర్ 4. జైసల్మార్ కోట 5. ఒరిస్సాలోని కోణార్క సూర్యదేవాలయం 6. కొల్‌కతాలోని విక్టోరియా మెమోరియల్ 7. సిక్కిం 8. జమీ మసీదు, ఢిల్లీ.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. Editor : B. Viswanatha Reddi (Viswam)

# ఎల్‌పీజీ పొదుపు



వంటగదిలోకి అడుగుపెట్టిన విష్ణు, తల్లి బియ్యం నానబెట్టడం చూసి, ''నువ్వు మాత్రం రోజూ ఇలా బియ్యాన్ని నీళ్ళల్లో ఎందుకు నానబెడుతున్నావు? లక్ష్మీ అత్తయ్య అలాచేయదు కదా?'' అని అడిగాడు.

''బియ్యం, పప్పు మొదలైన ధాన్యాలను ఉడకబెట్టడానికి ముందు నానబెటడం వల్ల అవి త్వరగా ఉడుకుతాయి. ఆ విధంగా వంట గ్యాస్ ఆదా అవుతుంది,'' అన్నది తల్లి.

''అలాగా! ప్రెషర్ కుక్కర్‌లో వంట చేయడంవల్ల కూడా చాలా గ్యాస్ ఆదాచేయవచ్చునని మా టీచర్ చెప్పారు. నేను ఇంధనం పరిరక్షణ గురించి ఒక సైన్స్ ప్రాజెక్ట్ చేస్తున్నాను. దీనికి సంబంధించిన మరి కొన్ని చిట్కాలు ఉంటే చెబుతావా, రాసుకుంటాను,'' అన్నాడు విష్ణు ఉత్సాహంగా.

''చెబుతాను. వంట చేయడానికి ముందే కావలసిన పదార్థాలను స్టవ్ ముందు సిద్ధం చేసి పెట్టుకున్నట్టయితే, ఫ్లేమ్ ఎక్కువ సేపు వృథాకాకుండా ఉంటుంది. ఇలా రోజూ చేయడంవల్ల నెలచివర చూశామంటే ఎంతో గ్యాస్ ఆదా అవుతుంది,'' అన్నది తల్లి.

విష్ణు తల్లి చెప్పేదంతా నోటు పుస్తకంలో రాసుకుంటూ, ''ఇంకా ఏవైనా ఉంటే చెప్పు,'' అన్నాడు.

''ఎల్లప్పుడూ వంటకు చాలినంత నీళ్ళు మాత్రమే, అంటే-మితంగా, ఎక్కువ కాకుండా ఉపయోగించాలి. అలా చేయడం వల్ల గ్యాస్ అదనంగా ఖర్చు కాదు. వంట పాత్ర మీద మూతపెట్టడం మరిచి పోకూడదు. తెరిచి ఉంచినట్టయితే పాత్ర నుంచి వేడి అనవసరంగా వెలుపలికి వెళ్ళిపోతుంది. ఎక్కువ ఎల్పీజీని వినియోగించుకుంటుంది!''

''వంట చేయడంలో ఇంత సైన్స్ ఉందని నాకు ఇంత వరకు తెలియదు,'' అన్నాడు విష్ణు విస్మయంతో.

''అవును విష్ణూ, ఇంధనం పొదుపు చేయడం ప్రతి ఒక్కరూ తన బాధ్యతగా గుర్తించాలి. అందువల్ల నేనెప్పుడూ ఇలాంటి జాగ్రత్తలను తప్పకుండా పాటిస్తాను,'' అన్నది తల్లి.

CHANDAMAMA (Telugu) December 2008 Registrar of Newspapers of India No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08




# బుబ్బా సాహసాలు




























